# పెళ్ళితిరకాసు






రచన :

రాంషా



ధర్మచక్రి పవర్ ప్రెస్, సామర్లకోట-533440

# పెళ్లితిరకాసు

పెళ్ళిళ్ళ విషయం అంతా చిత్రమే.

భగవంతుడు యెవరితో యెవరికి ముడిపడాలో తనే రాసిపారేస్తాడు. ఆ ప్రకారమే కిక్కురుమనకుండా మన పెళ్ళిళ్ళు జరిగిపోతాయి. మనం పుట్టకుండానే మన ముఖాన బ్రహ్మ రాసిపారేస్తుంటే ఎక్కడో సముద్రం, ఉప్పూ, అడివి, ఉసిరికాయలాగ మనుష్యులు కలుసుకుంటున్నారన్నా ఆశ్చర్యంలేదు.

తిరుపతి రాజుగారికి ఒక కొడుకూ కూతురు ఉన్నారు. ఆ అబ్బాయి పేరు రత్నరాజు. వయస్సు పదహారు సంవత్సరాలు. సూరపరాజుగారి కుమార్తె ప్రేమరత్నాన్నిచ్చి పెండ్లిచేయటానికి నిశ్చయమైపోయింది.

రత్నరాజుకి నిజంగా పెట్టిందిపేరు. బాగాచదువుకున్నాడు. మంచి స్ఫురద్రూపి. అతని అందాన్ని చూచిన ఏ ఆడదానికయినా మనస్సు చలించక మానదు. అంత అందం అతనిది. గుర్రపుస్వారి, కవాతు చక్కగా వచ్చు. అతని చెల్లెలు ప్రియంవదకూడా అంతకు తక్కువదికాదు. ఆమెకు పదిహేనవ ఏడు. సంగీత సాహిత్యాలలో మంచి నైపుణ్యంవుంది. ఆ పిల్లకుకూడా ఊళ్ళో పెళ్ళి కుదిరింది, దగ్గరలోనే వున్న పాతమహారాజుగారి పెద్దకుమారుడు యువరాజు (ప్రస్తుతం ఫ్యాన్సీషాపు పెట్టుకున్నాడు). గజపతిరాజుగారు పసుపు కుంకుమ పంపించారు. పచ్చదబ్బ పండులా వుంటుంది ప్రియంవద. సీతాకోక చిలుక రెక్కల్లాంటి బుగ్గలూ, దానిమ్మ మొగ్గలాంటి ముక్కు, మంచి పసందైన పెదవులు, సూర్యకాంతం పువ్వులాంటి ముఖమూ, చిలకలాంటి నాజూకైన శరీరం-ఆమెను వర్ణించటానికి దేవతలుకూడా చాలరు.

పురోహితుడే ఈ పెళ్ళి కుదిర్చాడు. ఆయన భార్య సోమిదేవమ్మ గారికి ఈ ఉభయకుటుంబాలూ పుట్టింటితో సమానం. అందుకని ఆవిడ మాటని ఉభయులూ కాదనలేరు.

కాని, గజపతిరాజుగారి తరపువారంతా వెంటనే ప్రియంవద పెండ్లి చేయమని పట్టుపట్టేరు. తిరుపతిరాజుగారికి మాత్రం ముందు కొడుకు పెళ్ళి చేసి ఆ తరువాత కూతురు పెళ్ళిచేయాలని ఉంది. అందుకని కూతురు పెళ్ళివాయిదా వేసి, కొడుకు పెళ్ళికి కావలసిన సన్నాహాలన్నీ పూర్తిచేస్తున్నారు. ముహూర్త నిర్ణయంకూడా జరిగిపోయింది.

అయితేనేం, అదేమి ముహూర్త బలమో కాని తీరా పెళ్ళిరోజు దగ్గర పడేసరికి రత్నరాజు మంచమెక్కాడు. అతనికి వల్లమాలిన రోగ మేదో పట్టుకుంది. ఇలాంటి అవస్థలో పిల్లవాడి పెళ్ళి ఆపడమే మంచిదని తిరుపతిరాజుగారు అభిప్రాయపడ్డారు. కాని ఆ పిల్లవాని తల్లిమాత్రం యెట్టి పరిస్థితిలోనూ పెళ్ళి ఆపటానికి వీల్లేదని మంకుపట్టు పట్టింది. పెళ్ళి వలన మనస్సుకు సంతోషం కలిగి ఆ రోగం యెగిరిపోతుందని ఆవిడ వాదించింది.

'కీడెంచి మేలెంచమన్నారు; మనవాడు గుటుక్కుమంటే?' తండ్రి ఒప్పుకోలేదు.

"ఏమీ మునిగిపోలేదు. పెళ్ళంటే మన చేతుల్లోవుందిగాని ఆయుర్దాయం మన చేతుల్లోవుందా? దాని ముఖానయెలా రాసివుంటే అలా జరుగుతుంది. ఏమో గీత బాగుండి మనవాడికి మార్కండేయుడి ఆయుస్సు రాకూడదూ? సావిత్రి సత్యవంతుని బ్రతికించుకోలేదా?.... యేమీ ఫర్వా లేదు కానివ్వండి" ఆవిడ హంగామా చేసింది.

తిరుపతిరాజుగారు అసలే మైనంలాంటి మనిషి. ఆవిడ వేడికి

ఆయన కరిగి నీరయ్యారు. పోయిన రాజ్యాలతోటే వారి పౌరుషాలుకూడా పోయ్యాయనుకుంటాను. యేమైతే నేమి ఆవిడమాటే నెగ్గింది.

మగాడు అవనేఅవ్వాలిగాని యెంత ఇంట్లో పిల్లిఅయినా ఊరిలో పులికదా! ఎప్పుడో యెందుకో ఆ యిరుగు పొరుగువారితో ఆయన కజ్జాకు కాలు దువ్వాడు. వారుకూడా ఆ కక్ష మనస్సులో పెట్టుకున్నారు. యెప్పుడు కాచేద్దామా అని కాచుకు కూర్చున్న వారికి రత్నరాజు జబ్బు సంగతి చెవిని పడింది. ఆ వెంటనే ఆవార్త పరిగెట్టి సూరపరాజుగారి హవేలీకి చేరుకుంది.

దానితో ఆయన రపరపలాడిపోయారు. చూసిచూసి రత్నంలాంటి పేర్మిరత్నానికి గొంతుకుకోయడమా? ఇంత మోసం జరుగుతూంటే చూస్తూ ఊరుకోవడమా?— వెంటనే పురోహితుడికి కబురంపి తగిన పంజాయిషీ ఇమ్మన్నాడు రాజులతో వ్యవహారం మాటలా? అయన మరింత కంగారుగా ఇంటికెళ్ళి సోమిదేవమ్మగారినడిగేడు. ఇద్దరూ తమకు కావలసినవాళ్ళు ఎగదీస్తే గోహత్య' దిగదీస్తే భ్రూణహత్య అన్నట్టుంది వాళ్ళకి. ఆవిడకి నిజం తెలుసు. తెలిసినా ఆవిడ నిజం చెప్పదు. ఆవిడ పూర్వకాలపుది. పది అబద్ధాలాడన్నా ఒక కొంప నిలుపమన్నారుగాని, ఒక్క నిజంచెప్పి ఒక్క కొంపనైనా అర్పమనలేదు. ఆ సంగతి ఆవిడ భర్తతో చెప్పింది. ఆయనకూడా వేదాన్ని స్మరించాడు. "సత్యం బ్రూయాత్; నబ్రూయా దప్రియం" అని వుంది; వేదం నిజం చెప్ప మంటున్నది. అప్రియం చెప్పవద్దంటున్నది. ఈ రెండూ ఎలా సాధ్యమౌతాయే పిచ్చిదానా!" అని రాగాలు పెట్టాడాయన.

"ఏమీ భయంలేదు. అంతా నేను చూచుకుంటా" నని ఆవిడ హామీ యిచ్చింది. సూరపురాజుగారి భార్యకు ఎలాగో నచ్చజెప్పి, తిరుపతిరాజు గారి అష్టయిశ్వర్యాలూ వర్ణించిచెప్పి, కిట్టనివాళ్ళ పోసుకోలుమాటల్ని తిట్టి

పోసి, తానే తన కళ్ళతో స్వయంగా పెళ్ళికొడుకునుచూపి వస్తానని హామీ ఇచ్చింది—

హామీ యిచ్చిందేగాని సోమిదేవమ్మగారి గుండెలు కొట్టుకొంటూనే ఉన్నాయి. అయినా భగవంతుడిమీదే భారంవేసి, తిన్నగా తిరుపతిరాజుగారి ఊరు చేరుకుంది. ఎలాగో ఆ ముహూర్తం వాయిదా వేయించమని గోలె త్తింది. రత్నరాజు అనారోగ్యం సంగతి తెలిస్తే తన కంఠంలో ప్రాణా లుండవని రాగాలు పెట్టింది. ఆ అబ్బాయి జబ్బు నెమ్మదించగానే మరో ముహూర్తం ఏర్పాటు చేయవచ్చునని బ్రతిమాలింది. అలా చేయకపోయి నట్లయితే యదార్థంకోసం సూరపురాజుగారు మరో మనిషిని పంపితే కొంప మునిగి కాగల కార్యం చెడిపోతుందని బెదిరించింది.

తిరుపతిరాజుగారికి ఏమి చెయ్యడానికీ తోచలేదు. ఆయన ఖిన్నుడై తలపట్టుకు కూర్చున్నాడు. తీరా ఆయనకు తోచేసరికి సూరపరాజుగారినుంచి మరో మనిషి అసలు విషయం ఏమిటో కళ్ళారాచూపి పోదామని చక్కా వచ్చాడు. ఆ వచ్చిన ఆసామిని వాకిట్లోనే కూర్చోబెట్టి, ఫలహారం పంపి స్తాననే వంకతో తిరుపతిరాజుగారు గదిలోకి దూరారు. అయ్యగారితో (ఆడ వారిని 'అయ్యగార'ని పిలవటం రాచ మర్యాద;) వచ్చిన ప్రమాదాన్ని గురించి మనవి చేశారు.

ఆవిడ భర్తను నానా చీవాట్లు వేశారు. "మాట ఒకటీ పెళ్ళి ఒక టీనా! ప్రాణాలయినా యిస్తారుగాని, రాచవారు ఆడినమాట తప్పుతారా!, అని ఈసడించారు. ఆ సంగతేదో తనే చూస్తానని నడుము బిగించారు.

తెరచాటునుంచే సూరపరాజుగారి భార్యగొంతు విప్పేసరికి ఆ వచ్చిన ఆసామీ ఉలిక్కిపడ్డాడు.

"మా వియ్యపురాలిగారి ఆజ్ఞ ఏమిటయ్యా!" అంది.

"చిన్న దొరగారి ఆరోగ్యంగురించి ఆందోళన పడుతున్నారయ్యా! వారికంతగా ఒంట్లో బాగా లేకపోతే ఈ ముహూర్తం తప్పించమన్నారయ్యా! ఎలా ఉన్నదీ నన్ను చూసిరమ్మన్నారయ్యా!" అని ఆ వచ్చిన ఆసామీ మనవి చేశాడు,

'చిన్నదొరగారి మీద మీఅయ్యగారికి ఆమాత్రం అభిమానం వున్నందుకు మాకు సంతోషం. వారికి తొంపచేపిందంతే! అంతలో అడ్డేమీలేదు. ఆమాత్రానికే ముహూర్తం వాయిదావేయటం మాకిష్టంలేదు. మాతరపున అన్ని సన్నాహాలూ పూర్తయివాయి. ఆలస్యమైతే మేము చేయించిన యేర్పాట్లన్నీ పాడైపోతాయి; అయినా పెళ్ళి సంతోషం యే రోగాన్నయినా ఇట్టే పోగొడుతుంది. అప్పుడే ఆహ్వానాలు అందరికీ పంపించి వేశాము. ఇప్పుడు మీవరవ చూస్తున్నట్లయితే మీఅయ్యగారికి మాతో వియ్యం పొందటం...."

"ఒక్కసారి చిన్నదొరగారిని చూడొచ్చాండి?"

"యిప్పుడే ఆపోప్రివేసుకుని పడుకున్నారు. అయినా వారికి వడిశం పట్టిందని చెప్పానుగదా! మా మాటంటే ఆపాటి నమ్మకంలేదా యెవరికీ? ఇంతకంటే మీరు చేయగల అవమానంవుందా?"

"అంతమాటనకండయ్యగారూ; మీరలాఅంటే యిహ నేను నోరు మూసుకుంటాను. సెలవిప్పించండి!"

ఆ వచ్చిన ఆసామీకి కడుపునిండా ఫలహారాలు పెట్టించి కొత్త బట్టలు కట్టించి తిరుపతిరాజుగారి భార్య కాశీ అన్నపూర్ణ అనిపించుకుంది. చివరికి ఆ దూత తిన్నగా సూరపరాజుగారిదగ్గరకెళ్ళి జరిగినదంతా పూస గుచ్చినట్లు మనవిచేశాడు. దానితో సూరపరాజుగారికీ, వారి భార్యకీ మతి పోయింది. ఎలాగ? ఒకవేళ ఆ పెళ్ళికుమారుడికి చచ్చే జబ్బే అయి పీటల

మీదే తారుమంటే తమకు తెలిసికూడా తమ గారాబుపట్టి గొంతుక్కి ఉరిత్రాడు వేసినట్టే అలా కాదు; అది నిజంగా రోంపయే అయితే ఈ సంబంధం యింక చెడిపోయినట్టే పీటలమీద సంబంధం చెడిపోయిందనేసరికి నానా అపవాదులూ వచ్చేస్తాయి. ఒకపట్టాన తమ కూతురికి పెళ్ళికావటం కష్టం.

ఆ దంపతులిలా తలక్రిందులైపోతుండగా వారి కుమారుడు మహీపతివర్మ సాంతం విని అన్నాడు

"రత్నరాజుని చూడన్వలేదనిగదా అంటున్నాడు అంటే అతనికి జబ్బు చాలా ఎక్కువగా ఉన్నదన్నమాట! పోతే మనం అడినమాట తప్పటం మంచిదికాదు. అలా అని మనచేతులతోటే మన పిల్లని చూచిచూచి చంపుకోలేం. ఈ పరిస్థితుల్లో నాకో వుపాయం తట్టుతోంది. మీ అభిప్రాయం కూడా చెప్పండి. మన పురోహితుని పంపి పెళ్ళి ముహూర్తంలో మార్పేమీలేదని, యథాప్రకారం పెళ్ళికి సిద్ధం కావలసిందని తిరుపతి రాజుగారికి కబురంపండి. వారు పెళ్ళికూతురుకి పసుపు కుంకుమ సమయంలో పంపిన జహ్వేరీ, మనమిచ్చుకుంటామన్న కట్నం చిన్నయ్యగారి జబ్బు నెమ్మదించేదాకా మనదగ్గరే వుంచుకుంటామని చెప్పండి—వాళ్ళిందు కొప్పుకోరు. ఆ మిషపై ఈ సంబంధం ఒదిలించుకోవచ్చు."

"వాళ్ళు దానికి ఒప్పుకుంటేనో!"

"ఒప్పుకోరు; ఆ నమ్మకం నాకుంది. కాకపోతే వివాహమే వాయిదావేసి ఉండేవారు. మనం కట్నంక్రింద యివ్వవలసిన సొమ్ములోంచి కానీకూడా రాకపోవటమే కాకుండా, వారు పెళ్ళికూతురుకు పెట్టిన సొమ్ము కూడా మనదగ్గరే ఉండిపోతుందంటే ఎవరు ఒప్పుకుంటారు? పైగా భోజనానికి మనిషి తక్కువైనట్టు పెళ్ళికూతురు ఒక్కర్తి!" అన్నాడు మహీపతిరాజు.

తండ్రి జాగ్రత్తగా ఆలోచించాడు:

"సరే; వాళ్ళు అలాచేస్తే మంచిదే. కాకపోతే ఆ ముహూర్తానికి నువ్వే చీరకట్టుకుని మీ అక్కయ్యకు బదులువెళ్ళు. గెడ్డం, మీసమూరాని కుర్రాడివి. నువ్వు అచ్చు అక్కపోలికే. నాటకాలలో ఆడవేషాలుకూడా వేశావు. భయంలేదు. నువ్వువెళ్ళి— ఆరత్నరాజుకి రోగం పోయినా లేక పరిస్థితులు విషమించినా గప్‌చిప్‌గా బట్టలుతొడుక్కుని చక్కారా! నలుగురిలో నగుబాటవుతుందని వాళ్ళేమీ అల్లరిచేసుకోరు. అలా చెయ్యి" అన్నాడు తండ్రి.

మహీపతిరాజుకి ఎంతో సిగ్గేసింది. భయంకూడా పొటమరించింది.

"అమ్మయ్యో! అలా చేస్తే దొరికిపోనూండి నాన్నగారూ! నలుగురికీ తెలిస్తే నన్నే తిడతారు" అన్నాడు మహీపతి.

"ఎంతయినా జావమరిదివికదా! అందుకని వేళాకోళం ఆడినట్టుగా తోసుకుపోతుంది. ఎటొచ్చీ ఏమాత్రం భయపడకుండావుంటే నువ్వు తప్పకుండా ఈ పని సాధించగలవు.... ఇక నా ఆజ్ఞకుతిరుగులేదు. ఈలోగా పెళ్ళికొడుకే చచ్చిపోయాడా వారిచ్చిన జహ్వేరీ' మనం యివ్వవలసిన కట్నమూ మనకే దక్కుతాయి.... పెళ్ళివారింట్లోనే జరుగుతుందనీ ముహూర్తానికి పిల్లను పంపించేస్తున్నాననీ కబురంపిస్తాను.... సిద్ధంగా ఉండు" అని సూరపరాజుగారు హుకుం జారీ చేశాడు.

సూరపరాజు పెట్టిన షరతులన్నిటినీ వినేసరికి తిరుపతిరాజుగారి భార్యకి వొళ్ళుమండింది. కొంచెం గుర్రుగా అపురోహితుడికేసి చూసింది. మళ్ళీ సముదాయించుకుంది. ఏమిచేస్తుందికనుక! తన కొడుకు చావు బ్రతుకులమీద ఉన్నాడు. ఈ వివాహంవల్ల అతనికి నూత్నోత్తేజం గలిగో, లేక ఆ పిల్ల అదృష్టమన్నా బాగుండో, దక్కితేదక్కచ్చు. దక్కక

పోయినా కనీసం కొడుకుపెళ్ళి చేసుకున్నామన్న సంతోషం ఉంటుంది. ఆ తర్వాతమాత్రం ఎక్కడికి వెడతారు అనుకుంది. తన ఆలోచనల్ని జాగ్రత్తగా చిరునవ్వు వెనకాలదాచి వారిష్టప్రకారమే కానిమ్మన్నానని చెప్పమంది.

పెళ్ళినాడు మహీపతిరాజు అవస్థ చూసితీరవలసిందే. చక్కగా చీరకట్టాడు. కళ్యాణంబొట్టు, బుగ్గను చుక్క కాళ్ళకి పసుపూ పారాణి చెవులకి దుద్దులు—అతని వాలకాన్ని చూపి ప్రేమరత్నం విరగబడి నవ్వింది.

మేనా మగపెళ్ళికూతుర్ని కూర్చోబెట్టుకుని తిరుపతిరాజుగారి ఇంటికి సంధ్యచీకట్లో చేరుకుంది. సోమిదేవమ్మగారు స్వయంగా ఆ పల్లకీ తలు పులు తెరచి, పెళ్ళికూతురికి యింత పసుపునీళ్ళు బొగ్గులు దిష్టితీసి అవతల పారేసింది. ఆతర్వాత తమకిచ్చిన బసలో ప్రవేశించారు. ముహూర్తం వేళ అవుతోంది. కాని పెళ్ళికొడుకుమాత్రం తయారవుతున్న జాడలేదు. అతని దర్శనమే ఎవరికీ కానివ్వటంలేదు.

తిరుపతిరాజుగారి అంతఃపురంలో గుసగుసలు బయలుదేరాయి. పెళ్ళికొడుకు లేకుండా పెళ్ళిచేయటమెల్లాగ ?

తిరుపతిరాజుగారి భార్య స్వయంగా ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చింది. భార్యకు స్వయంగా పుస్తెకట్టే ఆచారం రాజుల్లో లేదుగదా ! అందుకే పెండ్లికుమారుడు తన గదిలోనే సనాతన సాంప్రదాయ ప్రకారమే కత్తికి పుస్తె కడతాడు. సనాతనమైన జమీలుపోయినా సనాతనమైన ఆచారాన్ని ఎందుకు పోగొట్టుకోవాలి ?

సనాతన పద్ధతిలోనే వివాహం కానిస్తున్నామని ప్రకటించారు. దానికి వధువు తలిదండ్రులుకూడా ఏ విధమైన ఆక్షేపణ లేకుండా. అంగీకరించారు.

బాజాభజంత్రీలు మ్రోగాయి; పెళ్ళికుమార్తె తన విడిదిలో తల వంచుకు కూర్చోగా పెళ్ళికుమార్డు తన గదిలో కత్తికి పుస్తె కట్టాడు: కట్టాడన్నారు. నిజానికి ఆతను తెలివిలోలేడు.

ఇప్పుడు వధూవరులిద్దరూ పెద్దలకి నమస్కరించాలి. ఇదో చావొచ్చిపడింది. ఈ పెళ్ళి ఆచారాలున్నాయే అవెంత ప్రాణాంతకమౌతాయో ఇప్పుడర్థమవుతోంది.

తిరుపతిరాజుగారి మహిషి ఈ విషయంలోగూడా తన రూలింగ్ ఇచ్చింది.

"ఇప్పుడేమనుకునీ లాభంలేదు. మగవాళ్ళు ఎంతవాళ్ళైనా తల వొగ్గి నమస్కరించే ఆనవాయితి మా వంశంలో లేదు. అందుచేత మా చిన్న దొరగార్కి ప్రత్యామ్నాయంగా ఆయన చెల్లెలు ప్రియంవద ఈ కార్యక్రమంలో పాల్గొంటుంది."

ప్రియంవద కులుకుతూ ఉలుకుతూ వచ్చి కొత్త పెళ్ళికూతురు చిటికెన వ్రేలు పట్టుకుని మెల్లగా గిల్లింది. బుగ్గలపై చిటికెలు వేసింది. అందరూ పకపకానవ్వి "ఆడబడుచు అర్థమొగుడన్నారు: కానివ్వండి" అని ఆమోదించారు. ఇద్దరాడాళ్ళూ పెద్దలకి నమస్కరించటం చూడ తమాషాగానే వుంది. కొంతమంది బుగ్గలు నొక్కుకున్నారు.

ఆ తర్వాత పెళ్ళికూతురు ఒక్కర్తినీ పెళ్ళికుమారుని గదిలోకి తీసుకెళ్ళారు. తిరుపతిరాజుగారిభార్య. అసలే దుర్బలంగావున్న ఆ ఆసామీ ఈ రామడోళ్ళకీ. బెండులకీ బుర్రతిరిగి సొమ్మసిల్లిపోయాడు. ముఖంమీద నీళ్ళుచల్లి తల్లి సేదతీర్చింది.

పెళ్ళికొడుకు నిదానంగా తన భార్యని చూసాడు. మేలిముసుగు తళుకుల్లో మిసమిసలాడే ఆమె శరీర సౌందర్యం అతన్ని ఆనందపరిచింది.

అతన్నేకాదు. అతని తల్లికూడా ఆ పిల్లని నఖశిఖ పర్యంతంచూసి ఆ అందానికి విస్మయపడింది ఇంత అందమైన పిల్లముఖాన ఎక్కడ విధ వరికం రాసివుందోకదా అనుకుని నిట్టూర్చింది. భగవంతుడు ఆమెకి వైధ వ్యాన్ని కలిగించకుండా వుండుగాక అని మనస్సులో ఆశీర్వదించుకుంది ! పాపం. ఆవిడ ఎల్లాంటిదయినా ఆడదేకదా !

మరో సమస్య వచ్చిపడింది. ఆ రాత్రే శోభనం భార్యాభర్తలిద్దర్నీ ఒకే గదిలోకి పంపించాలి. ఇతరకులాలవలె రాజులలో శోభనంనాడు పేరంటాళ్ళవంటి హడావుడేమీ లేకపోయినా భర్తను పంపించాలిగా !

అందుకే తెలివిగా ఆ మర్నాటికి వాయిదావేశారు ఆ పిల్ల తలిదం డ్రులు ఉదయమే వెళ్ళిపోతూ కంటతడి పెట్టుకున్నారు. పెండ్లికుమార్తె కూడా యధావిధి రాగాలు పెట్టింది. "అమ్మా ! అత్తవారింట జాగ్రత్తగా మసలుకొని అత్తింటికీ పుట్టింటికీ కీర్తి తేవలసి వుంటుందిసుమా !" అని హెచ్చరించి ఆ (మగ) పెళ్ళికూతురు తలిదండ్రులు తరలిపోయ్యారు.

ఇక పెళ్ళికూతురి అంగరక్షకులుగా ఆడబడుచు ప్రియంవద, సూరపరాజుగారి దివాణం దాసి స్వర్ణముఖి మిగిలిపోయ్యారు

"ఆహా, ఏమి అందం ఈ ప్రియంవదది ! ఇలాంటివాన్ని పెళ్ళాడ గలిగితే నేనెంత అదృష్టవంతుణ్నో అయ్యేవాణ్ని !" అనుకున్నది పెళ్ళి కూతురు.

"ఛీ, దురదృష్టవంతుడు మా అన్నయ్య ! విన్నరాత్రే శోభించ వలసిన ఆమె అందాలు ఈనాడుకూడా నిరర్ధకమౌతున్నాయి. ఈ అందమే నా కాబోయే భర్తకున్నట్లయితే జన్మజన్మలా ఆయన పాదసేవ చేసు కుంటూ బ్రతికేదాన్ని" అని ప్రియంవద అనుకుంది.

ఆ పగలల్లా వచ్చిన బంధువుల్ని సత్కరించటంలోనే తిరుపతి

రాజు దంపతులకి కాలక్షేపమైపోయింది. పెళ్ళికొడుకు బ్రతికివున్నాడో లేడో, పెళ్ళికూతురు ఏమైందో - వారు పట్టించుకోనేలేదు.

ప్రియంవదనుంచి యెలాగో తప్పించుకుని, ఒంటిగా స్నానంచేసి, తిరిగి స్వర్ణచే చక్కగా అలంకరించుకుని శోభనం పెళ్ళికూతురిలా తయారయి వున్నాడు మహీపతిరాజు.

కాస్త తీరుబడి చిక్కగానే తిరుపతిరాజు దంపతులిద్దరూ ఒక చోట చేరారు.

"యిప్పుడు బంధువులెవరు లేరుగా ? బ్రతికిపోయాం . యిక వున్నది వారి దివాణందాసీ ఒక్కర్తే. ఆమెకి చెయ్యి విడిలిస్తే మనం చెప్పినమాట వింటుంది. కనుక ఈ రాత్రికి ప్రియంవదని పంపించి కాలక్షేపం చెయ్యమంటాను అని ఆవిడన్నారు. తిరుపతిరాజుగారు వారి మామూలు పద్ధతిలోనే భార్యమాటకు జవదాటబోయి ఊరుకున్నారు.

అత్తగారు లోపలికి అడుగుపెట్టేసరికి శోభనంగదిలో పందిరి మంచం మీదకూర్చున్న కొత్త పెళ్ళికూతురు దోమతెర చెంగుల్ని దగ్గరగా మూసేసింది. అత్తగారంటే ఆపాటిభయం వుందిగదా అని లోపల సంతోషించిన అత్తగారు గంభీరంగా.

"అయ్యో ! మీ ఆడబడుచుగారు ఈ మాపిడికి మీదగ్గర సాయం పడుకుంటారు." అని సెలవిచ్చింది.

మహీపతిరాజు హతలిపోయాడు. అతనిగుండె గుభేలుమంది ఆడ వేషమంటే వేసుకున్నాడుగాని. ఇంత చిక్కుల్లో పడతానని అనుకోలేదు.

"నేను ఒక్కర్తినే పడుకుంటాను. నాకు అలవాటు" అన్నాడు ఎల్లాగో.

"అయ్యో మీకేమిటి చిన్నపిల్లలు ! మీ యిద్దరిదీ ఒకటే వయస్సు భయందేనికి ? అంతగా యిబ్బందిగావుంటే మీ యిద్దరికీ మధ్య దుప్పటి అడ్డు కట్టుకోండి ! పెద్దదాన్ని: నామాట వినాలి.'' అని తిరుపతిరాజుగారి పట్టమహిషి ఆజ్ఞాపించింది.

ఆ ఆజ్ఞకిక తిరుగులేదు మహీపతిరాజు మరి మాట్లాడకుండా ఊరు కున్నాడు. కొత్త పెళ్ళికూతురు తన మాట కాదంటుందేమోనన్న భయం కొద్దీ చకచరా అత్తగారు వెళ్ళిపోయింది.

ఒక విధంగా మహీపతిరాజుకు భయంవేసింది; యింకోవిధంగా సంతోషం వేసింది ప్రియంవద తల్లి స్వయంగా వచ్చి తన కూతుర్ని ఈనాటి శోభనంగదిలోకి స్వహస్తాలతో పంపటం ఎంతబావుంది ! కాని, ప్రియంవద అల్లరిచేస్తే !

"ఆమెకి పదిహేనేళ్ళుంటాయి ! అంటే ఆమెకూడా పండి పక్వా నికి వచ్చేవుంది. కొంచెం తెలివిగా ఆమె హృదయాన్ని కరిగిస్తే. ఆ ఎర నా గేలానికి తగులుకోకపోదు" అనుకున్నాడు. మహీపతి.

ప్రియంవద నెలవులోకంటా నవ్వుతూ తలుపుతోసుకుని గది లోకి ప్రవేశించింది.

ప్రవేశిస్తూనే ప్రియంవద "ఓ చిలకలాంటి వదినా ! ఆకలేస్తుం దేమో చిలకల్ని కొరుకుతావా ?'' అంది నవ్వుతూ.

"అలాగే నా చిలకలకొలికీ ! దగ్గిరిగా రా !'' అన్నాడు మహీపతి రాజు పెళ్ళికూతురు వేషంలోనే.

యిద్దరూ నవ్వుకున్నారు. దీపం కాగడాలా వెలగటంచూచి, దీపం వుంటే నాకు నిద్ర పట్టదు. ఆర్పేస్తే మంచిదేమో ! అన్నాడు మహీపతి.

ప్రియంవద స్వహస్తాలతో దీపాన్ని తగ్గించి చక్కా వచ్చింది.

కొత్త కోడలా ! అటు పడుకుంటావా ? యిటు పడుకుంటావా ! అని ఆడిగింది ప్రియంవద.

"నీ యిష్టం వదినా !"

కాస్సేపు పిచ్చాపాటి మాట్లాడుకున్నాక, యిద్దరూ మంచంమీద చేరారు. మహీపతి ఆ మంచంపై ఒక వారకి జేరి దుప్పటీ ముసుగు తన్నాడు. రెండవవారకి ప్రియంవద చేరి దుప్పటి కప్పుకుంది. అంత వరకు మహీపతి నిగ్రహాన్ని చక్కగానే పాటించేడు. ఆ తర్వాత అతని మనస్సు చలించటం ప్రారంభించింది. గుండెలు కొట్టుకోసాగాయి. గొంతుక దగ్గుత్తికపడింది.

వదినా, నీకెన్నో ఏడు;

"ఏమి ? పదిహేనవఏడు" ప్రియంవద తెల్లబోయింది.

"నీకు పెళ్ళిసంబంధాలు వస్తున్నాయా ?"

ప్రియంవద జవాబు చెప్పలేదు. ఆమె ముఖం సిగ్గుతో కంద గడ్డలా ఎర్రబడింది. మహీపతి ఆటుతిరిగి ఆమె చెవిలో నోరుపెట్టి రహస్యంగా అన్నాడు. సిగ్గెందుకే పిచ్చిదానా ! మనిద్దరం ఆడాళ్ళమేగా !"

"ఈ ఊళ్ళోనే జగపతిరాజు అనే అతనికి నిశ్చయంచేశారు. వెంటనే పెళ్ళిచేయమని వాళ్ళు తొందర చేస్తున్నారు. నా అదృష్టంకొద్దీ ఇంకా ముహూర్తానికి నిశ్చయం కాలేదు." అంది ప్రియంవద

"ఏమి ? నీకు చప్పున పెండ్లికావాలన్న ఉబలాటం లేదా ?"

"నన్నేదో పిచ్చిదాన్నిచేసి, అన్నీ వాగించి అపహాస్యం చేయటానికేనా అడుగుతున్నావ్ ? భర్త కోసం మరదలు పక్కలో చేరిన నీకెంత

అదుర్దాలేదో నాకూ అంతే" ప్రియంవదకి కోపంవచ్చి ముఖం ప్రక్కకి తిప్పేసుకుంది.

"పిచ్చిదానా నీకెందుకంతకోపం ? నేనూ ఆడదాన్నేకదా ! నాకు మాత్రం హృదయంలేదా ?" మహీపతిరాజు బుజ్జగించాడు. ప్రియంవద నవ్వింది.

"చాల్లే, మా అమ్మలా మాట్లాడుతున్నావ్ ?"

"వయస్సునుబట్టిచూస్తే నీ మొగుడులాగే మాటాడుతున్నాను." అన్నాడు మహీపతి ఆలోచనలేకుండా: ప్రియంవద పకాలున నవ్వింది.

"ఊరుకోండి క్రొత్త పెళ్ళికూతురుగారు ! నేను మీ భర్తగారి తరపున వచ్చాను. ఆడబడుచు అర్ధమగడన్నారు. నేనిప్పుడు పూర్తి మగణ్ణి; జాగ్రత్త !" అంది నవ్వుతూనే.

"అయితే భర్తలాగే వ్యవహరించు! కళ్ళుమూసుకు పడుకున్నావే?"

—ఇలాగ వాళ్ళిద్దరూ వ్యంగ్యంగానే మాట్లాడుకున్నారు. క్షణ క్షణానికీ వాళ్ళల్లో ఉద్రేకం హెచ్చింది.

"మగడూ పెళ్ళాలమనుకుంటూ తలో దుప్పటీ కప్పుకోవడ మేమిటి ? ఇద్దరమూ ఒకే దుప్పటిక్రింద దూరుదాం" అంటూ మహీపతి రాజు ప్రియంవద దుప్పటి ఒత్తిగించి, తన దుప్పటి కప్పాడు. ఆ తర్వాత క్రమక్రమంగా ఆవిడ పమిట తొలగించి. రవిక ముడివిప్పి. నున్నని మెత్తని ఆమె మృదు శరీరోపరితలాన్ని నిమరసాగాడు. ఆమె మనస్సులో ఉన్న వసంతరాగం అతని చేతికి అడ్డులేకుండా చేసింది.

క్రమశః కోరిక విజృంభించగా గుండెలలో వణకుతో ఆమె నవ యవ్వన ప్రభల్ని స్పర్శించాడు. ముంతెలవలె చలిస్తూ, మెత్తగా పెల్లుబికి వచ్చాయి.

ప్రియంవదకు ఈ ఆట నచ్చింది. ఆమెలో వుబలాటం హెచ్చింది. తను ఊహించుకోవటంకన్నా తనూ తన వదినలాగే చేస్తే బాగుంటుందనుకొని అతని హృదయాన్ని స్పర్శించింది. ఏముంది? గంగా సింధు మైదానం.—

"ఇదేమిటి ? ఈమె నాకంటే పెద్దదికదా ! ఈమె - కొంపదీసి ఈమెలో స్త్రీత్వం పెరగలేదాఏమిటి ? అనుకుంది. ఆ ఆలోచనతో ఆమె వళ్లు ఝల్లుమంది."

అయితే యిప్పటికే పరిస్థితులు విషమించాయి. మహీపతిరాజు ఆమెను పూర్తిగా స్వాయత్తం చేసుకున్నాడు. అతని బాహువల్లికలలో ఆమె చిక్కుకుంది. ఆమె నోటినుంచి ఏ మాటా పెకలలేదు. అలా పెకలటానికి అవకాశం లేకుండా అతని పెదవులు ఆమె పెదాల్ని బలీయంగా అణచిపెట్టాయి. ఆమెకే తెలియని ఏదో అమృతపానం చేస్తున్నట్టయింది! శరీరం పట్టు తప్పిపోయింది. అతని యిష్టానుసారం ప్రవర్తించటానికే ఆమె శరీరం వేచివుంది. అయినా తెలివైనదిగనుక తిరిగి తననుతాను సంబాళించుకుంటూ.

"ఛీఛీ! వద్దు, లే వదినా, బావుండదు" అంది. అతను వినే స్థితిలో లేడు అమె అంగరక్షగా ధరించిన చిన్న నిక్కరు బొందు వదులు చేయాలని ప్రయత్నిస్తున్నాడు. గుండెలపై ఏ అచ్ఛాదనా లేకుండా చేసివేశాడు.

"తప్పులేదు మరదలా !.... సరదా అంతే!" మహీపతికి మాటలు రావటంలేదు. గుండెలు తీవ్రంగా కొట్టుకుంటున్నాయి. ఒక అమాయకురాలికి ద్రోహం చేస్తున్నానన్న పాపభీతి గుండెలలో ప్రవేశించి అప్పుడే అదరగొడుతున్నది. ఐనా పౌరుషం తెచ్చుకుని, ఆమె పెదాలను జుర్రుతున్నాడు. ఆమె తన శక్తికొద్దీ త్రోసివేసి అతన్ని విదిలించటానికి ప్రయత్నించింది; అతను విడిచిపెట్టడానికి ఒప్పుకోలేదు. ఆ సంఘర్షణలో ఆమెకి అసలు సంగతి అర్థమైపోయింది.

"ఏయ్, యెవరునువ్వు ? మా వదిన వేషంలోవచ్చి ఎందుకిలా మోసగిస్తున్నావ్ ?''

"నేను నీ భర్తని'' ఆమెని తన హృదయానికి హత్తుకోవాలని ప్రయత్నించాడు. ఆమె గట్టిగా విదిలించింది.

"నువ్వు నిజం చెప్పు. అసలు సంగతి నాతో చెప్పకపోతే గట్టిగా ఏడ్చి అల్లరిచేస్తా; ఆ తరువాత అనుభవిస్తావ్ "

"కోపం ఎందుకులే మరదలా ! నిజం చెప్పేస్తాను. నేను మీవదిన గారి అన్నయ్యని, నా పేరు మహీపతిరాజు మీ అన్నగారు చావుబ్రతుకుల మీద వున్నారని తెలిపి. మాచెల్లిల్ని మీ యింటికి పంపటానికి మా వాళ్ళు ఒప్పుకోలేదు. అయితే మీ అమ్మా వాళ్ళూ పెళ్లికి పట్టుపట్టటంతో మాఅన్న గారికి సుస్తీ నెమ్మదించేదాకా నన్నీ వేషంలో మీ ఇంట్లో వుండమన్నారు: కాని,భగవంతుడు నన్ను నీయంతటి అందగత్తెకు గాంధర్వవిధిని ఈవిధంగా వివాహం చేస్తాడని నేనెన్నడూ అనుకోలేదు. దైవసంకల్పం తప్పదుకదా! మన ప్రేమ ప్రస్తుతం మన యిద్దరి మధ్యనే దాచుకోవాలి! ఎవరితోటీ చెప్పక!'' అంటూ ముందుకువంగి మళ్ళీ ఆమెను కావలించుకోవాలని ప్రయత్నించాడు.

నిర్ఘాంతపోయిన ప్రియంవద అతనివైపు చూసింది. ఆమె మన స్సును సిగ్గూ. భయమూ, అనుమానమూ ఆక్రమించాయి. ఆ మె లో యిప్పుడు కోప తీవ్రత చల్లారిపోయింది. కాస్సేపటికి మళ్ళీ ఈ ప్రపం చంలో పడింది.

పాపం, ప్రియంవద—అతన్ని స్త్రీగానే భావించినప్పటికీ-అతన్ని మొదట్నుంచీ ప్రేమిస్తూనేవుంది. ఎటొచ్చీ స్నేహంగా అవిడపడ్డ పొరబాటు భావనే ఆకస్మాత్తుగా ప్రేమగా పరిణమించింది. అయినా అది క్రమపరిణా

మంకాదు. ఇప్పుడతను ప్రేమాగ్నిని ఆమె హృదయంలో రాజవేసి రగిలించాడు. ఒక అపూర్వమైన ప్రేమదేవత, ముత్యపుచిప్పకు స్వాతివానను అందించినట్టయింది.

క్షణంలో సంతోషం, క్షణంలో అవమానం-ఈ రెండు తీవ్రాగ్నుల మధ్య ఊగుతూ ఆమె హృదయం మండిపోయింది. అయినా నిశ్చేతనంగా ఆమె, ఆ గదిలోనే వుండిపోయింది. బైట తల్లి వేసినతాళం.

అదే అతనికి అపూర్వమైన అవకాశం యిచ్చింది. గౌరీశంకర శిఖరం కన్నా వున్నతమైన ప్రేమనీ, మహాసముద్రంకన్నా ప్రగాఢమైన ప్రేమనీ ఆమెకు హామీ యిచ్చాడు. లక్షన్నొక్క ప్రమాణాలు చేశాడు. కోటిన్నొక్క రాగాలు తీశాడు. త్వరలో వారి వివాహం అయితే అతర్వాత వారు జీవించే అపూర్వ స్వర్గసౌఖ్యాలు గురించి వర్ణించి, ఆమె స్వప్న ప్రపంచాన్ని ప్రేరేపించాడు.

ప్రియంవద నమ్మింది. ఆమె భావి స్వప్నసోపానాలను ఒక్కొక్కటే ఎక్కుతున్నది. ఆమె మరుక్షణంలో తనకు జరిగిన అవమానాన్ని. తన తల్లిదండ్రుల్ని చివరికి తనకిదివరకే పసుపుకుంకుమలు యిచ్చిన సంగతినీ మరిచిపోయింది. చేతులతో ముఖాన్ని కప్పుకుని కొత్త పెళ్ళికూతురి నునులేత సిగ్గుల్ని చిమ్మసాగింది. అతన్ని నమ్మింది. అతనికి తన మనస్సు నీశరీరాన్నీ అర్పించింది.

ప్రేమ తుఫాను విజృంభించి, పువ్వుల్నీ, పయ్యెదనీ ఉద్రూతలూపి విడిచిన తర్వాత. ఆ పయోదాలు చల్లారి ఒకరి కౌగిట్లో ఒకరు సొమ్మసిల్లి నిద్రపోయారు.

ప్రియంవదని మహిపతిరాజు గదిలోకి పంపటం స్వర్ణముఖికి ఇష్టం

లేదు. అయితే ఆమె మాటసాగే దిక్కుడకాదు. అందుకని గుండెల్లో అద టుతో కునుకురాక కుందుతోనేవుంది. దానికితోడు మొదట్లో పకపకలు, ఆ తర్వాత నిట్టూర్పులు వెల్లువలై ఆ గదిలోంచి వినపడటంతో ఆమెకు పూర్తిగా మతిపోయింది. తాను ఏ ప్రళయమైతే వస్తుందని భయపడుతూ వుందో అదేవచ్చి వెళ్ళిన జాడలనీ ఆమె హృదయంలో ముద్రించుకు వున్నాయి ఇక ఆ తెల్లవార్లు "ఓయిరాముడో, ఓయిదేముడో" అనుకుంటూ మూల్గుతూనే వుంది.

తెల్లవారి, ప్రియంవద కాలకృత్యాల్ని తీర్చుకోవటంకోసం బైటకు వెళ్ళగానే, స్వర్ణముఖిమహీపతిరాజును సమీపించి లబోదిబోమని ఏడ్చింది

"నేనేంచెయ్యనూమధ్య ! నన్ను మా నాన్నగారు పంపించారు. నాగదిలోకి ఆవిణ్ని వాళ్ళ అమ్మగారు పంపించారు "....అన్నాడు

"తప్పించుకోవలసింది"

"అంత అందమైన ఆడపిల్ల ఒంటరిగా శోభనం గదిలో దొరికితే ఎంత రాయిలాంటి మనిషయినా కరిగిపోకుండా ఉంటాడా?.... నువ్వునోరు మెదప కుండా వుంటే దేవుడిక్కూడా తెలియదు."

మళ్ళీ మహీపతిరాజు చీరపింగారించుకుని తయారైన తర్వాత అత్త గారికి వంగి నమస్కరించాడు. ప్రియంవదకూడా వచ్చింది ఇద్దరూ కొంటెగా నవ్వుతున్నారు. ఆ పగలంతా ఏదో హడావుడితోటే కాలక్షేపమై పోయింది పట్నం మాటుమణిగాక, ఆరాత్రికూడా ఇద్దరూ మళ్ళీ గదిలోకి చేరారు. మళ్ళీ తుమ్మెద ఝుంకారం, మధుపానం. మొత్తం మామూలుగానే సాగేయి.

స్వర్ణముఖి వుండబట్టలేక ఆ మర్నాటి ప్రొద్దున్నే మహీపతిరాజు ఇంటికెళ్ళి అతని తలిదండ్రులతో నిజం చెప్పేసింది. వాళ్ళు కొయ్యయి పోయారు. ఆశ్చర్యంతోను, ఆవేశంతోనూ సతమతమయ్యారు.

"ఈయన వ్యవహారం శ్రుతిమించి రాగానపడింది. ఇక ఉపద్రవం తప్పదు సరే వారివి ఏలాగో ఇంటికి తీసుకురావాలి తప్పదు" అనుకున్నారు.

సోమిదేవమ్మగార్ని పంపించారు. ఆచారంప్రకారం అక్కడ మూడు రోజులు నిద్ర పూర్తయాక మళ్ళీ తమ పిల్లని తమ యింటికి పంపించమని కబురంపించారు. ఇక్కడకూడా మూడురోజులు పూర్తికావాలన్నారు పాపం; ఈ నూతన దంపతులు ఈ రాయబారాన్ని విని హడలిపోయారు. అయితే తిరపతిరాజుగారి భార్య ససేమిరా అంది సూరపరాజుగారు ఈ పెళ్ళి విషయంలో పెట్టిన పేచీలు, వేసిన మడతలూ ఆమె హృదయంలో కోతపెడుతున్నాయి. పిల్లని పుట్టింటికి పంపించినట్టయితే బహుశా వారు కాపురానికే పంపించకపోవచ్చు. అందుకని మళ్ళీ కబురు చేసింది.

"మా చిన్న దొరగారికింగా స్వస్థత చిక్కలేదు ఆచారాలు. ఆనమాయితులూ అనిచూస్తే లాభంలేదు. మాకలాంటివాటిపై విశ్వాసంలేదు ఏప్పుడో తర్వాత పంపిస్తాను. ఇప్పుడు కుదరదని మా వియ్యాలవారితో చెప్పండి!" అన్నది.

సోమిదేవమ్మగారు తిరుగుముఖం పట్టింది. కాని, తిరుపతిరాజుగారి భార్య మాటలు స్వర్ణముఖి హృదయానికి వజ్రఘాతంలా తగిలాయి. ఏం చేస్తుంది గనుక? విస్పహాయగా ఆ శోభసంగదికి రాత్రింబవళ్ళు కంటిమీద రెప్పన్నా వాలకుండా. కాపలాకాస్తూ కూర్చున్నది! అవ్వ! యెవరన్నా వింటారేమో నన్న భయమైనా లేకుండా ఆ గదిలోంచి ఒకటే యికయికలు: పకపకలు: ఆ నూతన ప్రేమికుల ఆరడికి హద్దూపద్దూ లేకుండాపోయాయి.

రోజులు గతిస్తున్నాయి. లత్నరాజు ఆరోగ్యంకూడా కుదుటపడుతోంది. తన భార్య సౌందర్య విలాసాల్ని కళ్ళారా చూచినప్పట్నుంచీ అతనిలో క్రొత్తఆశ చివురించి, నవోత్తేజాన్ని కలిగించింది తన అర్ధాంగి

గాఢపరిష్వంగాన్ని ఎప్పుడు పొందుతానా అన్న తహతహ అతనిలో వెల్లి విరిసింది అతను లేచికూర్చున్నాడు లేచి రెండడుగులు వేశాడు. తూలాడు అలా తూలుతూనే గోడనుపట్టుకుని తిన్నగా వస్తున్నాడు.

స్వర్ణముఖి అల్లంత దూరంగా వుండగానే చూపి 'చిన్నదొరగారు వస్తున్నారు' అని కేకపెట్టింది.

గాఢ పరిష్వంగంలోవున్న ఆ నూతన ప్రేమికులిద్దరూ ఆ కేకకి తృళ్ళిపడ్డారు. ప్రియంవద ప్రక్కకే ఒత్తిగిల్లి పమిట సరిచేసుకుంది. మహీపతిరాజు మేలిముసుగు సరిచేసుకున్నాడు

'మా వదిన మహాపతివ్రత కనుక సావిత్రిలా భర్తను సాధించుకుంది' అని ప్రియంవద అన్నది.

"అన్నా పడిపోతావు కూర్చో!"

'ఫరవాలేదమ్మా!' అంటూ రత్నరాజు కూర్చున్నాడు. పెళ్ళికూతురు వంగి, ఆయన పాదాలకు నమస్కరించింది. వెయ్యేళ్ళు వర్ధిల్లమని ఆయన దీవించాడు వాళ్ళిద్దరి అనురాగాన్నీ చూసి అతని తల్లి ముసిముసి నవ్వులు నవ్వింది. మరి కాస్సేపటికి రత్నరాజు వెనక్కి వెళ్ళిపోయాడు. అంత కన్నా అతగాడు అక్కడ యెక్కువసేపుండటం మంచిదికాదని అతనితల్లి నిర్ణయించింది.

చీకటిపడింది నూతన ప్రేమికులిద్దరూ గదిలో చేరారు.

"మీ అన్నయ్యకు ఆరోగ్యంవచ్చింది. యింకఫరవాలేదు. నాచెల్లెలు అదృష్టవంతురాలే! మరో రెండుమూడురోజులలో నీకు బదులు బావగారే నా గదిలోకి వస్తారు. వెంటనే మనం జాగ్రత్తపడకపోతే కొంపమునుగు

తుంది" అన్నాడు మహీపతి"..... యెలాగో మీ అమ్మని ఒప్పించి నన్ను మా యింటికి పంపించే టట్టుచూడు! నేను వెళ్ళి నా స్థానంలోకి మాచెల్లెల్ని పంపిస్తాను ఆలస్యమైతే ప్రాణాలు పోతాయి!" అన్నాడు.

"నన్ను విడిచిపెట్టిపోతారా? నా గతేంకాను" ప్రియంవద వలవలా యేడ్చింది.

5-00

"పిచ్చిదానా! అదికూడా నేను ఆలోచించాను. ఏంచేస్తాంచెప్పు! నీకూ నాకూ కూడా యిదివరకే పెళ్ళి సంబంధాలు నిశ్చయమైపోయాయి.

నేను మీతో రావటం యిష్టంలేకపోతే నూతిలోదూకి ఛస్తాను! నా ఆత్మన్నా మీవెంట వస్తుంది" అన్నది ప్రియంవద. ఆమె ముఖంలో గాఢ నిశ్చయం స్పష్టంగా కనిపించింది. ఆమె దుఃఖాన్ని ఆపుకోలేక వెక్కి వెక్కి ఏడ్చింది. దానితో అతనికి మతిపోయింది. 894-8133

RAM

యెంత స్త్రీ వేషంలోవున్నా మగవాడు కనుక కొత్తసంబాళించుకుని ఆమెను తన కౌగిట్లోకి తీసుకున్నాడు. ఆమె కనుకొలకులనుండి కారే కన్నీటి వెల్లువలుఅతనివక్షస్థలాన్ని తడుపుతున్నాయి అతను ఏదోమార్గాన్ని ఆలోచిస్తున్నాడు. ACC NO. 22084

ఇది ఇలా వుండగా, రాత్రింబవళ్ళు తన కూతురు ప్రియంవద ఆ క్రొత్తకోడల్ని విపరీతంగా అంటిపెట్టుకొని వుండటం ఎబ్బెట్టుగా యెంచి ఆమె తల్లి బాధపడుతున్నది. అయినా ఆమె పల్లెత్తి ఏమీ అనలేదు. రేపు తన కొడుకు తన భార్యను స్వీకరించగానే ప్రియంవద తన స్థానంలోకి వెళ్ళిపోతుందిగదా అనుకుంది. కాని ఆరాత్రి యెందుకో పనుండి, ఆ గది ముందునుంచి వెడుతూ ఆగదిలోనుండి వినవస్తున్న వెక్కిళ్ళను చెవులు రిక్కించి మరీ విన్నది. విని, ఆగి ఏమిటా యిదని ఆశ్చర్యపోయి, నిశ్శబ్దంగా తలుపు కన్నంలోంచి చూసింది. అతని ఒళ్ళో ఆమె పడుకుని ఏడుస్తుండటం ఆమెను సముదాయించటం చూసింది.

'ఇదేమిటి అసహ్యం!' అనుకున్నది.

గట్టిగా కేకవేద్దామనుకుందిగాని ఆమె కొడుకు యిప్పుడే కోలుకుంటు న్నాడు. ఏమాత్రం గందరగోళమైనా అతని మనస్సు వికలమైపోతుంది. కనుక మెల్లగా తలుపుతోసుకుని గదిలోకి వెళ్ళాలనుకుంది. లోపల గడియ వేసివుంది.

'యెందుకూ గడియవేసుకున్నారు!" అన్నది. ఆ మాట వినబడే సరికి వారిద్దరూ తృళ్ళిపడి కళ్ళు తుడుచుకుని, తలుపు తెరిచారు ఆమె లోపలికి ప్రవేశించింది.

"యిదేమిటా్రి దిక్కుమాలిన పీనుగుల్లారా! ఆ కావలింతలేమిటి? ఆ ఏడుపు ఏమిటి? మీకేమన్నా బుద్ధి వుందా లేదా?" అని చెండుకున్నది.

వాళ్ళ రక్తం ఎగతన్నింది. యిద్దరూ బిట్టకరుచుకుపోయ్యారు నోటంట మాట రాలేదు. తిరుపతిరాజుగారి భార్య నఖశిఖపర్యంతం కోపంతో వణికిపోతున్నది. ఆపుకోలేక ప్రియంవద జుట్టుముడి పట్టుకుని, ఒక్క విసురు విసిరింది.

"నాదగ్గర నాటకం ఆడుతున్నావా మాదచ్చోదా! నీ తెగులుతీరుస్తా మండు" అంటూ తిరుపతిరాజుగారి భార్య బరబరా ప్రియంవదని ఈడ్చుకు పోయింది ఈ దృశ్యాన్ని కళ్ళారాచూసిన పరివారం ఈ ఘోరమంతా ఎం దుకు జరుగుతుందో అర్థంకాక ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు.

తిన్నగా మూలకొట్టులో పడేసి ప్రియంవద తల్లి లోపల తలుపు గడియవేసింది. పనిమనుషులు పరిగెట్టికెళ్ళి, పి్రియంవదని విడిపించే అవ కాశంలేక ఊరికే తలుపు కన్నంలోంచి చూస్తూ ఊరుకున్నారు.

చీపురుకట్ట తీసుకొని గబగబా నాలుగువడ్డించి రంకెలేస్తోంది.

'నిజంచెప్పు ! చెపుతావా! చెప్పవా? ఎందుకు ఏడుస్తున్నారో చెప్పు!'

తల్లి కొట్టిన దెబ్బలకి ఒళ్ళు మండుతున్నా, ప్రియంవద క్షణంలో ఆలోచించింది.

తనకేమీ తెలియదని బుకాయిస్తే మంచిదేమో అనుకుంది. కాని ఈ బుకాయింపువల్ల తనకు వచ్చేలాభమేమిటి? అందుకని నిజందాచకుండా చెప్పెయ్యటమే మంచిది. తనకు లోగడ ఏర్పాటయిన పెళ్ళిసంబంధాన్ని రద్దుచేయించుకోవచ్చు. అప్పుడు మహీపతిరాజునే పెళ్ళాడవచ్చు. ఒకవేళ తన తల్లి దండ్రులు అందుకు అంగీకరించరనే అనుకుందాం. తానే ఈ విధంగా అల్లరిచేయటంవల్ల ఈ సంగతి ఎలాగో గజపతిరాజుగారి చెవిని పడకపోతుందా? ఆయన వెంటనే ప్రియంవద తనకక్కరలేదని ప్రకటించకుండా ఉంటాడా? ఆ తర్వాత చచ్చినట్టు తనని మహీపతిరాజుకే యిస్తారు. ఇవ్వరూ, ఏ నూతిలోకన్నా దూకి చచ్చిపోతుంది. ఈ నిర్ణయానికి వచ్చి జరిగిన కధంతా తూ.చ తప్పకుండా మధ్య మధ్య వెక్కుతూనే తల్లితో చెప్పేసింది.

'మేము భార్యాభర్తలం. బ్రతికితే యిద్దరం బ్రతకాలి చస్తే ఇద్దరం చస్తాం. అన్నయ్యకు ఆరోగ్యం వచ్చిందికదా! ఇక మా వియోగం తప్పదనే దుఃఖంకొద్దీ ఏడుస్తున్నా. ఆయన యింటికి వెళ్ళిపోయి తన చెల్లెల్ని పంపిస్తానంటున్నారు. అమ్మా ఒక్క వరలో రెండు కత్తులిమడవు. నీకు కోపంవచ్చి చంపేసినాసరే, అతనికిచ్చి పెళ్ళిచేసినాసరే నీ యిష్టం.

కూతురు మాటలన్నీ గుండెలపై కుంపటిలారగిలి ఆ మాతృహృదయాన్ని దహించివేశాయి. తన వియ్యంకుడు. సూరపరాజు, తనని మోసగించటంకోసం తన కొడుకును ఆడకూతురు వేషంలో అత్తింటికి పంపిస్తాడా? ఆ వెధవ తన కూతురు గొంతుక కోస్తాడా? వీడికి ప్రాయశ్చిత్తం

చేయవలసిందే! అనుకుంది గబగబా తలుపులు తెరుచుకుని, మహీపతిరాజు గదివైపు పరిగెట్టింది పాపం. ప్రియంవద తనకు జరిగిన అవమానాన్ని క్షణం దిగమింగి తల్లిముందు కాళ్ళకిఅడ్డంపడింది. ఆమె ఒక్క తన్ను తన్నేసరికి గుమ్మంమీద పడి తల చితక కొట్టుకుంది, అయినా లెక్కపెట్టక తల్లి వెనకాలే పరిగెట్టింది ప్రియంవద. ఆమె వెనకాలనే పరిజనంకూడా పరిగెట్టారు.

ప్రియంవదని తల్లి ఎప్పుడైతే జుట్టుపట్టుకుని బైటకు బరబరా ఈడ్చుకుపోయిందో అప్పుడే అసలు రహస్యం బైటపడిందని మహీపతి రాజు గ్రహించాడు. మరుక్షణంలో స్వర్ణముఖికూడా పరిగెట్టుకొచ్చింది.

మీరు కొంపదీశారండీ! ప్రియంవదని తల్లి చీపురుకట్టతో బాదుతోంది! వెళ్ళి విడిపించండి! అన్నది స్వర్ణముఖి.

ఇవి పూర్వంరోజులా? రాజుల రాజరికానికి, వారి శౌర్యప్రతాపాలకి దేశాల్ని జయించలేకపోతే పోయిరి. అత్తగార్లనన్నా జయించగల స్థితిలో లేరు. పాతపేరు పెట్టుకున్న స్వర్ణముఖి పాపం ఇంకా ఈ రోజులు ఆ రోజులే అనుకుంటోంది.

మహీపతిరాజు ఒక్క క్షణంకూడా అక్కడ ఆగలేదు. గజేంద్రుడి కుయ్యో విని పరిగెట్టిన శ్రీహరిలా ఆడవేషమన్నా మార్చుకోకుండా అలాగే ఒక్క గెంతులో వీధిలోపడి. కాలికి బుద్ధిచెప్పాడు. ఊర్దంతా విరగబడి చూస్తున్న సంగతే పట్టించుకోకుండా తిన్నగా తన తండ్రిగారిల్లు చేరాడు.

తండ్రి సూరపరాజుగారు కొడుకుపై రంకెలేశాడు.

"చచ్చినట్టుంది! ఆడపిల్లలా వ్యవహరించరా అంటే మగవాడిలా

వ్యవహరించి వచ్చావా ? తోక ఒకటే తక్కువ సన్యాసులకి ! ఇదేమన్నా మర్యాదే ! ముందు ఆ బట్టలు మార్చు !"

ఎప్పుడైతే మహీపతిరాజు పరుగు లంకించుకున్నాడో స్వర్ణముఖి ప్రమాదాన్ని పసిగట్టింది. శత్రురాజులు అంతఃపురాన్ని ముట్టడించినప్పుడు ఎలా తప్పించుకోవాలో ఆ విద్యలో రివాణం దాసీలకు మంచి శిక్షణ ఉంటుంది. అదే యింద్రజాలాన్ని ఆమె ప్రయోగించి అంతర్ధానమయింది.

ప్రియంవద తల్లి గబగబా మహీపతిరాజు గదికి వచ్చింది. తలుపులు లోపల బిగించివున్నాయి. దబదబా తలుపులపై చీపురుకట్టతో బాది, కోపతీవ్రతను ఆపుకోలేక వణికిపోయింది.

"చచ్చినాడా ! నీ ముఖం తగలెయ్య ! తలుపుతియ్! నీ ప్రాణాలు తీసేస్తా !....తీస్తానా, తలుపులు బద్దలు కొట్టమన్నావా !....నువ్వు చచ్చిపోను! ఉం ..."

లోపల చడీ చప్పుడూ లేదు. జాబూ జవాబూ లేదు, ప్రియంవద తల్లిని చల్లార్చాల చాలాని ప్రయత్నించింది. కాని, ప్రయోజనం లేకపోయింది. ఆమె తలుపుల్ని గుంజిగుంజి ఎలాగో గడియ ఊడబెరికింది చీపురుకట్టని వజ్రాయుధంలా పట్టుకుని ఆ గది నలుమూలలా గాలించింది; ఏముంది ?

పంజరం ఖాళీ ! పిట్ట ఎగిరిపోయింది !

మంచంక్రింద కుర్చీలకింద, బల్లలకిందా ఎక్కడన్నా దాకున్నాడేమో చూడటంకోసం ఆ తల్లి మోకాళ్ళనీ, మోచేతుల్నీ చితకకొట్టుకుంది. అయినా ప్రయోజనంలేక, కడుపులో ఉన్న ద్వేషాగ్నిని చల్లార్చుకోలేక కసికొద్దీ కుళ్ళు తిట్లన్నీ తిట్టింది.

గజపతిరాజు యిప్పుడు అంకుశంలేని ఏనుగయ్యాడు. గబగబా తిరుపతి రాజుగారి యింటికి వెళ్ళి;

"జరిగిన సంగతంతా నాకు తెలుసు. మీ అమ్మాయికి పసుపూ కుంకుమ క్రింద యిచ్చిన నగలన్నీ యిచ్చెయ్యండి మర్యాదగా ! ఇంక మాట్లాడకండి;" అన్నాడు;

తిరుపతిరాజు ముఖంలో కత్తివేటుకు కూడా రక్తపుచుక్క లేకుండా మాడిపోయింది. అప్పుడే వీడికెలా తెలిసిందా అని ఆశ్చర్యపోయాడు. అయినా ఎందుకైనా మంచిదని మభ్యపెట్టాలని చూశాడు.

"నాయనా ! నీతో ఎవరేమి చెప్పారో నా కర్థంకావటంలేదు. ఏమీ లేనిదానికి ఎందుకింత రాద్ధాంత సిద్ధాంతాలు చేస్తావ్" బుజ్జగించాడు;

"ఏమయ్యా ! ఎంతమందినిలా మోసంచేస్తావ్ ! పిల్లదాన్ని పరాయి మగాడికి అప్పగించి డబ్బు సంపాదిస్తూ పైపెచ్చు నాకు అంటగట్టాలని చూస్తావు ! చూడు నా తడాఖా !" అంటూ గజపతిరాజు తిరుపతిరాజు దవడమీద సాచి లెంపకాయకొట్టాడు.

"దొంగవెధవా! నాయింటికొచ్చి నన్ను కొడతావట్రా" అంటూ ఆ ముసలాయన వెర్రిరాగాలు పెట్టాడు. ఆ తర్వాత సర్దుకొని గజపతిరాజు మీద కలియబడ్డాడు. మరో దెబ్బకి గజపతిరాజు నేలమీదపడి విలవిల తన్నుకున్నాడు ఈ రామరావణ సంగ్రామం ఇలా చెలరేగేసరికి ఇంటిల్లపాదీ అక్కడికి చక్కా వచ్చారు, విడదీసారు.

"ముసలి ముండాకొడక ! కొడతావురా నన్ను ! కోర్టులో తేలుతుందిలే; అక్కడ ఏం చేస్తావో చూస్తా !" అంటూ గజపతిరాజు పారిపోయాడు. సంగరంలో ఓడిపోయే రాజులకి కోర్టులే ఈ రోజుల్లో ఉత్తమ రణరంగాలుగా సంతరించుకున్నాయి.

కొడుకు ఎంత వారిస్తున్నా వినకుండా తిరుపతిరాజు పోలీసుకేసు పెట్టాడు. చివరికి కోర్టుకెక్కారు. అక్కడకూడా ఘర్షణ ప్రారంభమయింది గాని, పోలీసులు అణచివేశారు.

కోర్టువారు అంతకుపూర్వం జరిగిన పెళ్ళి నిర్ణయాలన్నిటినీ రద్దు చేశారు. గజపతిరాజుకు సూరపరాజుచే నష్టపరిహారం యిప్పించారు. సూరపరాజు కుమార్తె ప్రేమరత్నాన్ని రత్నరాజుకి ప్రియంవదని మహీపతిరాజుకీ ఇప్పించారు. వారిద్దరి వివాహాలనీ రిజిస్ట్రారు నమోదు చేసుకున్నాడు.

ఊరంతా ఈ కథ చెప్పుకుని కడుపుబ్బా నవ్వుకొనేవారు. చాలా కాలం గతించిపోయింది. చివరికి ప్రజలుకూడా మరచిపోయారు వారిప్పుడు మరో విచిత్ర సంఘటనకోసం ఎదురుచూస్తున్నారు.



# ఆడవాళ్ళ సంత

ఆడవాళ్ళకోసం ప్రత్యేకించిన మూడవతరగతిపెట్టెలోకి పురుషుడు ప్రమాదవశాత్తూ ఎక్కినప్పుడు ఎంత కంగారు పడతాడో అంత కంగారుపడ్డాను. ఇంతకీ ఆ సంతలోకి ఎలా వచ్చేనో నేనిప్పుడు చెప్పలేను. ఆ సంతలో ఇందుకని రేకులషెడ్డులేమీలేవు, పెద్ద పార్కులావుంది. రంగురంగుల ఆకులతోనిండిన వింతవింత మొక్కలన్నీ ఉన్నాయి. దారికిటూ అటూ వేలాది ఆడవాళ్ళు చిత్ర విచిత్ర వర్ణాల రవికల్నీ, చీరల్నీ ధరించి, రకరకాలైన జుట్టుముడులతో బారులు తీర్చి నుంచున్నారు. కాటుక ధరించిన సోగకన్నులతో, చిరునవ్వుల చిందుతూ వారి శరీరంలోని కట్టులోని ప్రతివంపూ మనల్ని ఆకర్షించి తమ వైపు లాక్కునేటట్టుగా ప్రణయాన్ని ఒలికిస్తున్నారు. ముందు భయంభయంగా వాళ్ళవైపు చూచినవాడినల్లా నాలో ఎలాంటి విచారాలు రేకెత్తాయో చెప్పలేనుగాని ఏదో ఇంద్రజాలంలో సమ్మోహితుణ్నయినట్టు మెల్లగా అడుగులు వేస్తూ, ఒక్కొక్కళ్ళనే పరిశీలిస్తున్నాను.

ఒక్కనాటివాళ్ళుకారు; ఒక్క కాలంనాటి వాళ్ళు కారు. చరిత్రకందిన కాలాలనుంచీ, విభిన్నరుచులకీ, విభిన్నవ్యవస్థలకీ, ప్రతినిధులీ ఆడాళ్ళు ఒక్క విశేషం ఏమిటంటే—వీళ్ళంతా ఏ కాలం వాళ్ళయినా అందరూ భారతీయులే. నాకు తెలిసినంతవరకూ అందరూ ఆంధ్రులే. (ఆ వాక్యం వ్రాయటానికి కూడా నాచెయ్యి వణుకుతున్నది.)

ఇట్లాంటి సంఘటన జరగటం అబద్ధమని మీరు భావిస్తారేమో; మీరు నమ్మిన మీ రచయితే మిమ్మల్ని ద్రోహం చేస్తున్నాడని అపోహపడతారేమో; అది ధర్మంకాదు అవిచ్ఛిన్నమైన భారతీయసాంప్రదాయాన్ని మరచిపోకండి. చరిత్రని తిరగవేసి చూడండి. మొదటిరోజుల్లో భారతస్త్రీలను

బజారుల్లో వేలం పాడినట్టే కనిపిస్తుంది. రానురాను ఆడవాళ్ళ జనాభా పెరిగినకొద్దీ ఆడపల్లలు చవకయిపోయ్యారు. అవసరాలకు అదనమైన ఈ ఉత్పత్తిని గంగానదిలో పారవేసేవారని చరిత్రాధారాలు చూడండి. భర్తతో భార్య సహగమనం మాటేమిటి చెప్తారు? కామమ్మ కధన్నా మరిచిపోయారా? బెంగాల్ లోని పురోహితుడుకూడా నూటముప్ఫయిమందికన్నా తక్కువకాని కన్నెల కన్నెచెర విడిపించి తన జనానా బందిఖానాలో దాచి పాతివ్రత్యాన్ని కాపాడినట్టు బ్రిటిషుమాన్యుయల్స్‌లో చదవలేదా? వరవిక్రయాలు, కన్యాశుల్కాలమాట జ్ఞాపకంచేసి మిమ్మల్ని నొప్పించడం నాఅభిమతం కాదు. మన కృష్ణదేవరాయలు ఒరిస్సా రాకుమార్తెను చెరపట్టి వివాహం చేసుకున్నమాట ఏమిటంటారు? ఆయన అంకితం పుచ్చుకొన్న "పారిజాతాపహరణం" ఈ పాప నివారణార్థమే నంటారేమో!

పోనీయండి! ఇంకో సంగతి చెపుతాను. విజయనగరం రాజుల్లోనే రెండవ దేవరాయలు కాలంలో "నికోలా కోంటే" అనేయాత్రీకుడు వచ్చి ఆ రాజ్య వైభవాన్ని వర్ణించాడు. భరతరాజుల్లోకల్లా ఈ రాజు చాలా గొప్పవాడట! "ఈయనకు 12,000 ల భార్యలున్నారు. రాజు ఎక్కడికి వెళ్ళినా అందులో నాలుగువేలమంది కాలినడకని అనుసరించి వంటపనులు చూసేవారు. ఇంకో నాలుగువేలమంది గుర్రాలమీద అనుసరించేవారు. ఇంకో రెండుమూడువేలమంది. రాజుగారితో సహగమనం చేస్తారనే షరతుమీద పల్లకీలెక్కేవారట" ఈ ఇటాలీయన్ యాత్రికుని కథనమే నిజమైతే నేటికి కూడా వంటచెరకు ఇంత గాయకం కావటానికి ఇదే కారణమయి ఉంటుంది.

ఈ కారణాలన్నీ ఆలోచిస్తుంటే ఆనాడు నేను ఆడవాళ్ళ వంతలో చిక్కుకున్నానంటే. అందులో అసంభవమేమీలేదు. బహుశా ఇంగ్లీషువాడు క్విట్ ఇండియా చేస్తూండటంవల్ల చిన్న పెట్టుబడిదారులందరూ తమ

ఆస్థిని గుత్తపెట్టుబడిదారులకి అమ్మివేయటంకోసం ఈ సంతయేర్పాటు చేశారేమో! పరికించి చూస్తునుగదా భూస్వామ్య వ్యవస్థ నేల యీని నట్లుగా కనిపించింది. ఎంతకాదన్నా అదృష్టవంతుణ్ని: మళ్ళీ ఈ వ్యవస్థను చూడలేకపోవచ్చు. విశ్వనాథ సత్యన్నారాయణగారు గిరిక సౌందర్యాన్ని అనుభవించారుకనుకనే ఈ వ్యవస్థ పోతున్నదని బాధపడటంలో న్యాయముంది. నాఆశీస్సు "వేయిపడగ"లెత్తి ఆయన్ని వెయ్యేళ్ళు కాపాడు గాక!

ఒక్క అడుగు ముందుకు వేశాను. ఇదిగో పింగళి సూరన్నగారు, కృష్ణదేవరాయల ఆస్థాన దిగ్గజం! ఆ పక్కనున్న ఆవిడ కలభాషిణి కాబోలు! ఇక వాన్ని తోమితోమి వదిలిపెట్టాడాయన. అది మామూలు పిల్లకాదన్నాడు. నట ముఖ్యుని ప్రియనందనట! దాని మాటల్లో కలికితనమూ చతురతా స్పష్టంగా కనిపిస్తాయట! అంతేకాదు! వయస్సు క్రొత్తన్నాడు వెలయాలి వంగడమన్నాడు. ఇక దాని చక్కదనము, వన్నెలాడితనం. కలికితనం పొగడ శక్యంకాదు పొమ్మన్నాడు. స్వతహాగా సరసుడు కనుక అది తన నర్తననైపుణ్య విలాసాలచేత విటుల చిత్తవిత్తాల్ని హరించి పారేస్తుందని భయపెట్టాడుకూడా. అదేమి ప్రారబ్ధమో గాని ఆనాటి సరసులకు జవసత్వాలుడిగినా శృంగారమే రసమై ఊరుకుంది. ఇదేమి ప్రారబ్ధమోగాని ఈనాటి సరసులైన యువకులకి భయానక భీభత్సాలే రసమై ఊరుకున్నాయి. నాకు కాళ్ళు దడదడలాడసాగాయి. కలభాషిణో, సంకుల భాషిణో చెప్పలేనుగాని ఆమె నాతో సవిలాసంగా సంస్కృతం తెనుగులో మాట్లాడింది. నాకు అర్థంకాలేదు. నృత్యం చేసింది కాని, అది మన సినీమాతారల నృత్యంలా లేకపోవడంవల్ల ముసలిసాని గజ్జె కట్టిన తీరు కనిపించింది.

అదిగో అల్లసాని పెద్దన్నగారుకూడా వచ్చారు. ఆయన జుట్టు అల్లిక జిగిబిగి చూసేసరికి సినీమాలలోని రాక్షసవేషం జ్ఞప్తికి వచ్చింది. వరూధిని కాబోలు ఆయన ప్రక్కనే నిలబడి తాంబూలం చిలకల్ని చిటికెన వేలికి చుట్టి అందిస్తున్నది దంతక్షతాలకు కళ్ళు చిట్లిస్తూ బొమముడి పాటు నటిస్తున్నది. ఆమె నఖక్షతానికి కాబోలు ఆయన మోరపైకెత్తి వెక్కిరిస్తున్నట్లు పళ్ళు పైకెత్తాడు.

ఇంతలో సారంగు తమ్మయ్యగారు బరబరా నన్ను ఈడ్చుకుపోయి దేవదేవిని చూపించారు. 'ఆమె కటాక్షవీక్షణాంచలాలు యువధైర్య కంచుకంబులు చించి చికాకుపరచి విపంచుచేయగల'వని ఆయన చెప్పనేచెప్పాడు. ఆమె కూడా అల్లాగే నా వైపు చూసింది. నాకు గుండెలు జారిపోయాయి. కొంత విమర్శనాజ్ఞానం ఉన్నవాణ్ణి కనుక తట్టుకొని ఒక్కలగువుతీసి ఇంకో గుంపులో పడ్డాను. అందుకోంచి ఎవరో ఒక పెద్దజుట్టు గ్లాస్కోలాల్చీ గలాయన "అభయమ్మభయమ్మ"ని లేవనెత్తారు. నిదానించి చూస్తునుగదా మా గురువుగారు కృష్ణశాస్త్రిగారే! ఆయన భుజంమీద వ్రాలి ఏడ్వబోతే ఆయన కొంచెం దూరంగా జరిగి, లాల్చీ భుజాన్ని చూపుడ్వేలితో తుడిచి, జుట్టు కొనవ్రేళ్ళతో మీటి "ఇది మన ఊర్వశి. ఈమె భుజం మరీ మెత్తగా పరుపులా ఉంటుంది. అందాకా నీతల దానిభుజంమీద పెట్టుకో, ఫరవా లేదు. నీకు తల్లి లాంటిది" అని ఓదార్చి ఏమోయ్ నీ "కామేశ్వరి"ని తీసుకు రాలేదం ?' అన్నారు. దాని కోసం రామమూర్తిగాడే తెగ తిరుగుతున్నాడండి. వాడికే కనిపించలేదు' అన్నాను. ఆయన కేమిటో చటుక్కున జ్ఞాపకంవచ్చి 'ఎందుకులే దాని భుజంమీదపడకు; ఇలా చెట్టుకింద చచ్చినట్టు పడుకో' అని మందలించి చుట్ట అంటించారు.

నేనుకూడా గురువుగారి ఆజ్ఞను శిరసావహించి నిజంగా చచ్చినట్టే పడుకున్నాను కాని, దగ్గరలో జోడీలుజోడీలుగా నిలుచున్నవారెవరా అనే

అనుమానం నన్నుపట్టుకు పీడిస్తున్నది. కంటిరెప్పల్ని కుదించి దొంగ చూపులు చూస్తూ గురువుగారి ఆజ్ఞనుధిక్కరించాను. నాయనిసుబ్బారావుగారు "వత్సల" నీ నండూరి సుబ్బారావుగారు "ఎంకి" నీ, మునిమాణిక్యం నరసింహారావుగారు "కాంతాన్నీ" తీసుకొచ్చారు. వెంకట పార్వతీశ్వరకవులు "ఏకాంత 'సేవ'' లో నోముదిగి,

"వేణుగానరవంబు వినవచ్చెనేమొ
యమునలో అప్పుడే అమృత మువ్వొంగె;
ప్రియసఖీ, చెప్పవే వ్రేపల్లెనుండి
బయలుదేరెనటమ్మ. బాలకృష్ణుండు ?''

అని ఆలపిస్తున్నారు. బాలాంత్రపువెంకట్రావుగారూ ఓలేటిపార్వతీశంగారూ ఇద్దరూ ఆమెని తలోవైపునా పట్టుకొని, వెంకట్రావుగారి చేతిలో స్వర్ణభస్మం పార్వతీశంగారి కళ్ళలో నీళ్ళు స్పష్టంగా కనిపిస్తున్నాయి. బహుశా అణుచుకోలేని భయంతో. సన్నని గొంతుకతో వణుకుతూ కూనిరాగం తీస్తున్నారేమో! అదే వాళ్ళకి మురళీ గానరసంగా వినవచ్చిందేమో! నోరు మరింతగట్టిగా మూసుకున్నాను.

నండూరి సుబ్బారావుగారు ఎంకి ప్రక్కనవిలబడి తనలో తనే కుమిలిపోతున్నాడు. "ఎంకితో తీర్థాని కెళ్ళాలి" అన్నఆయన చిరకాలవాంఛ నేటికి ఫలించింది. తీరా సంతకొచ్చాక ఎంకి చూపులు సుబ్బారావుగార్ని విడిచి అందర్నీ పలకరించసాగాయి. దానితో ఆయన హృదయం చిట్లి "ఎంకి వంటి పిల్లలేదోయ్ లేదోయ్; ఎంకి నా వంకింక రాదోయ్!" అని విలపించసాగేడు ఆమెను విడిచి ఉండలేనని రాగాలు పెట్టాడు. చివరికి బెలపోయి "ఉత్తమాటలు నీవి పొమ్మందిరా!" అని గోలుగోలున రాగాలు పెట్టాడు. ఎలాగో ధైర్యం తెచ్చుకొని జనంకేసి చూస్తూ-

"రవల యెలుగుల గంగ, రమ్మందిరా యెంకి
శివమెత్తి తానాలు సేసిందిరా!"

అని పిలువసాగాడు. ఆయన మనస్తత్వానికి నవ్వు వచ్చింది! అప్పటికే కొంత ధైర్యాన్ని చిక్కబట్టుకొన్న నాకు.

పాపం నాయని సుబ్బారావుగారి స్థితి చాలా శోచనీయంగా ఉంది చినిగిన చొక్కా, వంచె ధరించి వణుకుతూ వత్సల ప్రక్కన నించున్నారు. ఆయన కుంభవృష్టిగా ఏడుస్తున్నారు.

"జీర్ణవసనుండను. ఈ చలి చింపకొనెదు
నా కృశీభూత దేహమ్ముపైకి పొర్లును;
ఈ ప్రవాహవేగము నిల్వనీదు నన్ను,
ప్రళయ సూచనయేమో నా ప్రణయమునకు."

ఇంతకీ ఆ ప్రళయమేమిటో అర్థంకాలేదు. కాని, ఇటు ప్రబంధ కవులకీ. అటు భావకవులకీ ఏదో పుట్టి మునిగిందని మాత్రం తెలిసి పోయింది.

బసవరాజు "నాయిక" చికాకుపడి "ఎవరు సంతోషింప నీయలంకారంబు? ఎవరు కని మెచ్చుకొననీ సొమ్ములెల్ల?" అని కోపంతో నగలన్నీ ఒల్చి విసిరేస్తూ "దాసిగానుండటకైనా తగనా? ప్రాణేశ! దేవా!", అని కర్నాటక బాణీలో ఏడుస్తున్నది.

రామచంద్రప్ప అప్పారావుగారికేమొచ్చె చెప్పండి! ఆమె పేరెవ్వరో గాని ఆమెని తీసుకొచ్చారు, ఆయన 'రక్తవిహారం' తోళ్ళవ్యాపారంకన్నా ఘోరంగా ఉంది. "నే భయంకర కాముకుడ. నాకరాలచితిని కన్యకలు వెన్నవలె కరిగిపోదుర"ని ప్రకటించి, వెన్నలా ఆయన కరాలచితిని కరగక పోవటంవల్లనేమోగాని ఆమెను చూపిస్తూ "....ముద్దిదేయును కన్నులరగ

మోక్షం: మరచి మరపించి, జాలిలో, మమతలో.... వ్రాల్చివేయు! నా గులాబి! నా పువ్వుబొమ్మ" అని అరుస్తున్నాడాయన! అరబ్బీయుని బొమ్మ వేసి, అరబ్బులను గురించి పరిచయం వ్రాసి, కాల్టెక్సు పెట్రోలునే వాడుడన్న ప్రకటనలాగ.

ఒక్కొక్కప్పుడు ఏ విషయమైనా వెర్రికుక్క కరిచిన పిచ్చిలా వ్యాప్తికొస్తుంది. వచ్చివచ్చి అది చివరకు ఫాషనయిపోతుంది. ఈ సౌందర్యాల పోటీకోసం ఏర్పడ్డ ఆడవాళ్ళ సంతలోకి రాకూడనివాళ్ళు కూడా వచ్చారు. ఉదాహరణకు సూరవరం ప్రతాపరెడ్డిగార్ని చూడండి! ఆయన గొప్ప పండితుడు; మంచి విమర్శకుడు; ఆయనకూడా ఇందుకు కక్కుర్తిపడతాడని అనుకుంటామా? ఆయనకూడా ఒక "ప్రణయిని" ని తీసుకు వచ్చాడు.

"నీ నును జెక్కులున్. మరియు నీ చిరునవ్వును, దంతకాంతి యున్, నీ నయగారముల్ కలికి! నీదు మిటారపు గుబ్బదోయియున్...." అని ఒకటే గోల! మరిడమ్మ విగ్రహం ముందు దండకం చదువుతున్న భక్తుడిలా ఒకటే ఆక్రందన!

కవికొండల వెంకట్రావుగారికేం బుద్ధి చెప్పండి! ఆయనకూడా తయారయ్యాడు రవిక ఒకటి మొలలో దోపుకొని, బహుశా ఆయనకి ఎవరూ దొరికివుండరు. అందుకని "రంగంటే రంగేకాదు; చెంగంటే చెంగేకాదు. రంగద్దినట్టి చెంగు రాచుకొన్నాడి." అంటూ ఏదో కొంప మునిగినట్టు సాతాని జియ్యర్‌లా నెమలి ఈకల కట్ట పట్టుకొని ఒకటే శివం ఆడుతున్నాడాయన.

స్వామి శివశంకరులకంటె విరాగి ఎవరుంటారనుకుంటాం? ఆయన కూడా ఎవరినో తీసుకొచ్చి పెద్ద పెద్ద సంస్కృత శ్లోకాలకు తెలుగు విశ

క్తుల్ని జేర్చి మంత్రాలు చదివినట్టు చదువుతున్నారు: అవి అర్థంగాక మనం వెళ్ళి ఏమిటండీ మీరంటున్నారంటే మనముఖం ఎగాదిగాచూసి, ఈ చప్పు పనుల్ని తిడుతున్నానంటారు. మా గురువుగారు వెళ్ళి ఏమిటయ్యా ఇదంటే మీరు చేసిన పనిని పొగడుతున్నానంటారు. అందరం కలిసివెళ్ళి అడిగితే బుర్రలుకొట్టి చూసుకొండి అర్థమంటారు. మన మందుగుండు సామాను కొండల్నిసైతం పిండికొడుతుందిగాని ఆయని పద్యాల్ని బ్రద్దలు కొట్టలేదు. అలాంటి సన్యాసుల జోలికి వెళ్ళటం మంచిదికాదనుకొని దృష్టి మరల్చు కొన్నాను.

ఇంతలో గురుపాదుల గొంతుక స్పష్టంగా వినబడింది, దీక్షగా శ్రు తిలో రోధిస్తున్నారు. ఊర్వశికూడా గుడ్ల నిండిన నీటితో ఆకాశంవేపు చూస్తూన్నది; "అయ్యయ్యో! ఊర్వశి విషాదార్ద్రమూర్తి! ఈ విశీధాన నా హృదయానవిందే—పూర్ణిమా శర్వరయామిని బొగ్గువోలె—ఈ ఎడద వోలె; కాలిపోయినది నేను," అన్నారు. నేను విలువెల్లా కరిగి ఆయన్ని ప్రశ్నించాను. ఈ కథంతా ఏమిటో చెప్పమని:

ఆయన చెప్పారు: "ఇవాళ సౌందర్యపరీక్ష. ఆంధ్రదేశంలోని అన్ని కాలాల కవులూ తమ నాయికల్ని తీసుకొచ్చారు. వీళ్ళ అందాన్ని యువకకవులు ఎన్నుకోవాలి. వాళ్ళకి ఇందులో ఎవరు నచ్చుతారో: ఎవరి జడపట్టుకు లాగుతారో: ఎవరి బుగ్గలమీద చిటికెలు వేస్తారో; ఎవరి జుట్టులో పూలచెండులు గుచ్చుతారో: ఆ నాయికని తెచ్చినవాడి జీవితం ధన్యమయినట్టు. తతిమ్మాకవులంతా వాడికి గులాములు కావాలి. తతిమ్మా నాయికలంతా ఈ ఎన్నికగన్న నాయిక కాలిక్రింద బలాదూర్ కావాలి. ఇది పందెం. యువకవిని నువ్వొక్కడవే వచ్చావ్‌గాని, ఊర్వశికి నువ్వూ కొడుకు వరస. ఇక్కడ నుంచి జారిపోతే ఎవత్తో నిన్ను వలలో వేసు కొంటుంది. దానివల్ల దాన్ని తెచ్చిన వెధవకి నేను యావజ్జీవితం బానిసను

కావాలి:" కాస్సేపాగి అన్నారు. "ఇంకెవరూ రాలేదూ? మన అనిశెట్టి, సోమసుందరం, ఆరుద్ర....?"

"రాలేదు గురువుగారూ!" అన్నాను.

"తగుదునమ్మా అని నువ్వు తయారయ్యావా? నీ వోటు నాకు పనికిరాదు సరికదా నా శత్రువుకు పనికొస్తుంది.. సరిలే. అన్నట్టు మా బుజ్జాయిగాడు గాని ఇక్కడికి...."

"రాలేదు గురువుగారూ!" అన్నాను.

మళ్ళీ మా గురువుగారు గుల్లలోకి ముడుచుకొనే నత్తలా యథా స్థితిలో కొచ్చి "చివురింపవో చైత్ర శుభోత్సవ విభాత కళ్యాణము ఈ దరిద్ర హేమంతమున", అని పాడుకొంటున్నారు.

మొత్తానికి కొంత సేపటికి వాతావరణం నిరాశాజనకంగా తయారయింది. తాము ఇతరులకి బానిసలము కాలేదన్న తృప్తివున్నా, ఇతరులు తమకు బానిసలు కాలేదన్న దుఃఖంతో కవులందరూ కుమిలిపోతున్నారు. పండుగనాడూ పాత మొగుడేనా అని ఏడుస్తున్నారు కావ్యనాయికలు.

ఇంతలో అకస్మాతుగా పెద్ద తుఫాను వచ్చినంత గోల బయలుదేరింది. ఎక్కడినుంచో శ్రీశ్రీ కేక వినవడింది. ఆ గొంతుక భావకవుల కందరికీ గుర్తే. వీళ్ళ ముఖాలు చాటంత అయ్యాయి. సుబ్బిశెట్టి కాతా తెరిచిన కొత్తలో చింతామణి తల్లి ముఖం అట్టాగే అయ్యేదనుకుంటాను. శ్రీశ్రీ కెనడా యింజన్‌లా జోరుగా వస్తున్నాడు. గబగబా మనుష్యుల్ని తోసుకుంటూ, పెద్ద కలవరం వినిపించసాగింది, దారిపొడుగునా తన "యువ కాశల నవపేశల సుమగీతావరణం"లో—

"ఎటుచూపిన చటులాలంకారపు
మటుమాయల నటనలలో

నీ రూపం కనగానందున
నా గుహలో, కుటిలో, చీకటిలో
ఒక్కడనై సుర్కిక్కిన రోజులు లేవా ?"

అంటూ దారిలో ప్రతి ముఖాన్ని పరికిస్తూ పరుగులు తీసి, ఏవే దృశ్యాల్‌తో చాయో ఆగి—

"పడుపుకత్తె రాక్షసరతిలో
అర్ధనిమీలిత నేత్రాల
భయంకర బాధల పాటల పల్లవి"
అని గావుకేక పెట్టాడు.

అదిగో అనిశెట్టికూడా ఇంకో మూలనుంచి వస్తున్నాడు. ఆయన వెనకనే రెంటాల గోపాలకృష్ణ ! ఈ యిద్దరూ ఒకరి వెనుక నొకరుగా ఒంటెల దండులా కాళ్ళు ఇసకలో గుచ్చిగుచ్చి వేస్తూవస్తున్నారు అనిశెట్టి కొంచెం దగ్గరగా రాగానే కృష్ణశాస్త్రిగారు పరమసంతోషంతో సమీపించి, ఎదురు సన్నాహంగా "ఏమోయ్ ! అనిశెట్టి ! అని పలకరించి ఓరకంటితో ఊర్వశిని చూపిస్తూ తన గిరిజాలకొపల్ని మునివ్రేళ్ళతో ఎగరేసి చుట్ట ముట్టించారు. అనిశెట్టి ఆగి కొంచెం విదానించి చూశాడు, చూసి—

"ఈ పురుషుడు స్త్రీ ప్రాణం కొన్నాడా ?" అన్నాడు. గురువుగారు విభ్రాంతపోయారు. ఆయన నోట్లోని చుట్ట ఆరిపోయింది. అని ఊరుకున్నాడా ? "ఏ ఇంద్రుని ఇనపవేళ్ళు చీల్చిన పీకుసుమాన్ని ?" అనికూడా అన్నాడు. మా గురువుగారి చుట్ట నేలమీదకి రాలిపోయింది. ఊర్వశి కేసి విదానంగాచూసి "కాడికట్టినపత్తిలాగు పడివుందే ?" అన్నాడు అనిశెట్టి. కృష్ణశాస్త్రిగారంటే సామాన్యులా ? అభినవపురూరవులు ఆయనకు ఉడుకుమోత్తనం వచ్చింది. కురుక్షేత్ర యుద్ధంలో అర్జునునిచేత కర్ణునిలా

ఖేదపడ్డారు. ఈ యువకులపైనేనా తాను ఆశపెట్టుకొన్నది. ఈ యువకుల నేనా తాను అధ్యక్షురాలిగా ఆశీర్వదిస్తున్నది? —ఆయన కాటుకకళ్ళు చెమర్చాయి. బిక్కమొగంతో, సుళ్ళు తిరిగిన నోటితో గుక్కపెట్టి ఏడ్చారాయన"..... నాకుగాదులు లేవు. నా కుషస్సులు లేవు" ఒకటేగోల! పక్కనున్న నల్గురూ సంతోషంతో చప్పట్లు నిరిచి ఆయన తమకే కావి పయ్యే అవకాశం ఉన్నట్టుగా నాల్గుమాటలు అనేవరికి గురువుగారు శృతిమించి "....నన్ను మనసారగా ఏడ్వనీరు మీరు; నన్ను విడువుడు; ఒకసారి విడిచినంత...." అని లేస్తే మనిషిని కానన్నంత రాక్షసంగా ఏడ్వసాగేరు. అనిశెట్టి ఆగకుండా చరచరా నాలుగడుగులు వేసేసరికి కావ్యనాయికలంతా అశ్రులువాచి బాహుమూలరుచుల్ని ప్రదర్శిస్తూ ఆహ్వానించసాగారు దానితో మరీ పిచ్చెత్తిపోయాడు అనిశెట్టి:

"ఆడవాళ్ళ సంత ఒకటి
అమ్ముడుపోతోంది చూడు;
నల్లమందు విద్రనీది:
స్మశానస్థశాంతి నీది
ఊరిమధ్య
పుండులోని బాధలాగ
మండుతోంది."

అన్నాడు ఉక్రోశంతో, ఎవ్వరూ లక్ష్యం చెయ్యలేదు. పిచ్చిఆసుపత్రిలో ఉండవలసినవాడు పొరపాటున ఈ దేవలోకానికి వచ్చాడన్నారు. దానికి అనిశెట్టి మరీ రంకె వేశాడు:

"నీ కుటుంబం ప్రసవించిన
నీతి అడవి మృగమయింది.
ఇది సమాజ శరీరాన
వెన్ను విరుచు రాచకురుపు"

అని శపించాడు. అయినా ఆడవాళ్ళు నవ్వుతూ రమ్మంటూనే ఉన్నారు.

"మానంతో ఆడుక్కునే
అనాథలార్తులు ఆనదలు
రౌరవ నరకాగ్నిలోకి
రా రా. అని పిలుస్తారు"

అని మానస సంబోధ చేసుకొని, జితేంద్రియత్వాన్ని సాధించి, కళ్ళుమూసు కొని ఒళ్ళు బిగబట్టాడు, అంతవరకూ కొయ్యబారి చూస్తున్న రెంటాల గోపాలకృష్ణ తృళ్ళిపడి వెంటనే అందుకున్నాడు. ఏమనాలో అతనికి తోచ లేదు. ఏమీ అనకపోతే బావుండదేమో అని భయం. అందుకని అనిశెట్టి పల్లవిని నెమరువేసుకొని—

"పతిత యువతుల బజారు
పాట పెడుతూ ఉంది చూడు"

అని అర్చి, 'అంకితం అనిశెట్టికి,' అన్నాడు. కవిజనం గొల్లుమనేసరికి సిగ్గుపడి మూర్ఛపోయాడు.

ఇంకోమూల మరీ పెద్ద గలాటా జరుగుతోంది. ఆక్కడికి శాంతి శరశ్రీతలు దెబ్బతిన్నాయికూడా ఏ మూలనుంచి వచ్చాడో. ఏ గొడవ తెచ్చాడోగాని సోమసుందర్ గావుకేకలు వినిపిస్తున్నాయి. అల్లసాని పెద్దన్నంత లేసి వాళ్ళుకూడా జబ్బలు చరచుకొని ఆతనితో కుస్తీ పట్టటానికి ప్రయత్నిస్తున్నారు అంత అవాచ్యం మాటలంటున్నాడు కాబోలు! ఏమిటా అని చూడపోతే—

"డబ్బుకోసం
జబ్బలమ్ముకొంటూ
బ్రతుకుతున్న అంగడి జీవితం
అద్దెకొంప జీవితం

ముళ్ళ కంచెపై
ఆరేసిన జీవితం
ఊరవతల పుంతలో
పారేసిన జీవితం
ఎర్రని జీవితం
ముక్కానికోసం
బిళ్ళలు వాపసుచేసే
పోస్టాఫీసు జీవితం
నెత్తురు కారుతున్న జీవితం
నావకొనల పాత్రికుడులో
జారుతున్న జీవితం...."

అంటూ అరుస్తున్నాడు. ఓపికపట్టి కప్పరపు విడాన్ని తులుక్కున వుమ్మి. అల్లసాని పెద్దన్నగారు ఒక పిడుగు గుద్దేసరికి పిడికెడు సోమసుందర్ మంచినీళ్ళన్నా అడగకుండా క్రిందపడ్డాడు. దానితో అక్కడ జనం చెల్లా చెదరై పోయింది.

అంతకు ముందే ఇంకోమూల బైరాగి బయలుదేరి తన "చీకటి నీడల" కమండలోదకంతో అందగత్తెల్ని పునీతం చేస్తూ, తిన్నగాటకొమ్మ దగ్గర ఆగి తన "నూతిలో గొంతుక" విచ్చి

"ఓ వేశ్యా నీవంటే నాకు అసహ్యం"

అంటూదగ్గరచేరి. చల్లగా, అందరూ చూచేలా ఆమె చుబుకాన్ని పట్టుకొని

"పేరుకొన్న చీకటిముద్దవు; ముద్దరాలః" అని లాలించి.
"ప్రేమా? ఔను నాకు నీపై
ఒక చెప్పనలవిగాని ప్రేమ
చింకి గుడ్డపై బిచ్చగాని ప్రేమ"

అని వర్ణిస్తూ 'ఎందుకు చీదర! రా ఇంకా దగ్గిర!' అనీ తీసుకొని గోసాయి చిటాకెలు వేస్తూ

"పెచ్చని చలిమంట ప్రేమ
ఈ తేయి గడుపలేమా ?"

అని మాయమైపోయాడు ఆమెతో,

ఉన్న చిత్రమేమిటంటేఆబోగందాన్నిఆ బైరాగే ముందుపంపించాడు. ఆతర్వాతవచ్చి అయనే తేసికెళ్ళిపోయాడు. కావ్యనాయికలందరూ ఆ బోగం దానికి గులాములయ్యారు. మహాకవులలో పెద్దగందరగోళం ప్రబలి యువ కులనందర్నీ మోసుకెళ్ళి బయట పారేస్తున్నారు. అందరూ ప్రాణాల్ని గుప్పెట్లో పెట్టుకున్నాము. యువక కవుల దేహాలన్నీ మహాకవుల దెబ్బ లతో కుమిలిపొయ్యాయి. సింహద్వారాన్ని దాటించి రక్షక భటులు మమ్మల్ని తీసికెళుతూంటే గుమ్మటంలా రాయప్రోలు సుబ్బారావుగారు గుమ్మానికి ఒక ప్రక్క కూర్చుని-

'ఏ దేశమేగినా ఎందుకాలిడినా
పొగడరా నీ తల్లి పేరు భారతిని'

అని సందేశిస్తున్నారు. ఆ గుమ్మానికే రెండవప్రక్క గుడిపాటి వెంకట చలంగారు నగం చింపిన చీర లుంగీగా ధరించి, లంబాడీ బాడీ తొడుక్కొని తన మ్యూజింగ్సులో 'తెలుగుజాతి నానాటికి నిర్వీర్యమై పోతున్నది' అంటూ వ్రాసుకు పోతున్నారు;

భూస్వామ్యవ్యవస్థ చరమ కాంతుల్ని చూసే అదృష్టం ఆ విధంగా నాకు కలిగింది.



# శాంతికాముడు

కామేశ్వర్రావు ఆఫీసునుంచి ఇంటికొచ్చేసరికి గదినిండా పొగమూరుకుంది. ఉయ్యాల కట్టినచీరలో చంటిబిడ్డ నిద్రపోతోంది. ఎదబిడ్డ, తల్లి కల్లావు ఊదుస్తూంటే ఆమెవీపుమీద పదుకున్నాడు. పెద్ద వెధవలిద్దరూ అన్నాలు మెక్కుతున్నారు. పెళ్ళి ఈడుకొచ్చిన పిల్ల పెద్దమనిషయి పాతిక వందలన్నా కట్నానికి, ఇంకో వెయ్యినూటపదహార్లు ఖర్చులకీ పట్టుకు కూర్చోమంటోంది. భార్య సదలిపోయిన యవ్వనం, చిరిగిపోయిన చీరెలు; పొగబారిన ఇల్లు, విసుగెత్తిన మనస్సులు.

కామేశ్వర్రావు పడకకుర్చీలో జార్లబడి ఆలోచిస్తున్నాడు. సుభద్రమ్మ పమిటచెంగు లాక్కొని నడుంచుట్టూ చుట్టుకొని, ఆశ్చర్యంగా గెడ్డంక్రింద అరిచేతి వ్రేళ్ళు పరిచి తనముందు నిలుచుంది. ఇంకోసారి ఇంచుమించు అదే అవతారంతో శివమెత్తినట్టు చిన్న వెధవని చీపురుకట్టతో బాదుతోంది. మరోసారి పమిటచెంగు పరుచుకొని వంటింట్లో తల కట్టుకు పడుకుంది. పొయ్యిలో పిల్లి లేవదు. పిల్లలు ఆకలితో అలమటించిపోతారు, దెబ్బలు ఎన్నితింటే ఆకలి తీరుతుందికనుక.

ఇలాంటి సుభద్రమ్మ కామేశ్వర్రావుకు అసంతృప్తి కాకపోతేఏమిటి? సరే అతను కామేశ్వర్రావు ఆ నమ్మకం అతనికి దృఢంగా ఉంది. కాని, అతని భార్య కామేశ్వరమ్మకాదు, సుభద్రమ్మ. సంసారానికి అవసరమైన గుట్టులో ఎంత సుభద్రమ్మో రోగానికి అవసరమైన రొష్టులోకూడా అంత సుభద్రమ్మే

కామేశ్వర్రావు పద్ధతి ఆమెకు నచ్చలేదు. పందొమ్మిది వందల ముప్ఫయిమూడులో నెలకి అతనికి అర్జన నలభయి రూపాయలు. అప్పటికి పెద్దదీ తర్వాత వాడు పుట్టనే పుట్టారు. రెండవవాడు కడుపులో ఉన్నాడు.

తిండికి బట్టకీ లోపం లేకపోగా చాట్నామాట్నా పోపుపెట్టికో ఒకటో రెండో మీదుకెట్టేది. ఇప్పుడు ఆ జీతానికి తోడు ఇంకో అరవై దాకా కరువు భత్యంవస్తోంది. మొత్తం నెలకి ఒక శతమానం కళ్ళ జూస్తున్నాడు. అయినా కానీ ఇంటికి రావటంలేదు. ఆవచ్చే దబ్బంతా ఏం జేస్తున్నాడో ఆమెకి అర్థంకాదు. ఇంకో ఇద్దరు పిల్లలు పుట్టినా చుట్టాల జంజాటం తప్పిందికదా ! ఎప్పుడన్నా అతన్ని అడిగితే "తాగుతున్నాను" అంటాడు. తాగితే తాగమను; ఆవిడకేం ?

"అప్పటికీ ఇప్పటికీ జీవనప్రమాణం నాలుగురెట్లు హెచ్చింది. జీతం మాత్రం కరువు పేరుచెప్పి ఒకటిన్నర రెట్లు మాత్రమే హెచ్చింది. అంటే జీతానికి రెండున్నర రెట్లు నెలబడ్జెట్‌లో లోపం వస్తుందన్నమాట. నూరు రూపాయల్ని ఆర్గురికి పంచితే ఒక్కొక్కరికి పదహారురూపాయల పదణాలు వస్తాయి. అంటే రోజుకి ఎనిమిదణాల తొమ్మిదిపైసలన్నమాట. ఆ కుటుంబంలోని ప్రతీ ఒక్క మనిషీ ఆ చిన్నమొత్తంలోనే తన జీవితావసరాలనన్నీ నెరవేర్చుకోవాలి. కామేశ్వర్రావుగాని అర్థశాస్త్రవేత్త అయితే ఇలా ఆమెకి నచ్చచెప్పి వుండేవాడు. కాని కామేశ్వర్రావు వట్టి గుమాస్తా మాత్రమే ! ఆలా అని కామేశ్వర్రావు ఫూల్‌కాడు. బీకాం చదువుకున్నాడు. మాల్థస్ థీరీమొదలైన అర్థశాస్త్ర సూత్రాలన్నీ అతనికి కంఠతా వచ్చును. ఆ థీరీ ప్రకారం జననష్టం జరిగితేనేగాని ఆర్థిక దుస్థితి తొలగిపోదు. తనయితే ఫరవాలేదుగాని, తీరా తనవల్ల వచ్చే ఆ వందరూపాయలు కూడా లేకుండాపోతాయ్. ఇక తన పిల్లలూ ! రమా ఇందులో ఎవరు చావాలి ? రామరామ. అసలు ఆ థీరీనే మరచిపోవటం ప్రారంభించాడు,

తాను పగలల్లా ఆఫీసులో హెడ్డుగుమాస్తాచేత చెప్పుదెబ్బలుతిని మొహంవాచి ఇంటికొస్తాడు. తన భార్య చల్లనిమాటలు చల్లి సేదతీరా

అని అతని కనీసకోర్కె— అతనలా కోరటం సబబేకూడా. కాని, ఆ వగ లల్లా వూళ్ళో అప్పులవాళ్ళచే నానాతిట్లూపడి, పిల్లలపోరు భరించలేక, ఏడ్చి ఏడ్చి, తన భర్త సముదాయించాలని ఆమె ఎదురుచూస్తూవుంటుంది. చివ రికి ఇద్దరూ నిరాశపడి ఎడముఖం పెడముఖంగా రాత్రిల్లా గడుపుతారు. మళ్ళీ తెల్లవారుతుంది. మళ్ళీ చీకటి పడుతుంది. కాని ఆ జీవితాల్లో శాంతి ఉండదు.

మొత్తానికి కామేశ్వర్రావుకు అశాంతి ప్రబలింది. అతనికి శాంతి కావాలి. అతని అశాంతికి కారణమేమిటో ఆలోచించాడు. అతనికి తెలుసు. ఐతే అది నివారించుకోగలిగి దికాదు కనుక ఇంకోమార్గం వెతుక్కో వాలి ఏమిటా మార్గం ?

* * * * * *

"ఖాళీ ఉందా ?"

"ఉంది రండి ?"

"ఏం తీసుకొంటావ్ ?"

"పది"

"బ్యాంకువీధి పిల్ల పదిరూపాయలడిగేసరికి కామేశ్వర్రావు కొంచెం తటపటాయించాడు. కాని, అతనికి శాంతికావాలి. శరీరానికికాదు మనస్సుకి.

లోపలికి వెళ్ళాడు. ఎందుకు వెళ్ళాడు ? ఎలావెళ్ళాడు ?ఎవరన్నా చూస్తారనిభయం లేదా ? - చూస్తేనేం ? తనకు శాంతి కావాలి. కాని, వరువుగాదు.

"సిగరెట్టొకటివ్వండి"

"ఛఛ, నేను సిగరెట్లు కాల్చను."

"అదేమిటండీ మీరు మగాళ్లుకూడాను. సిగరెట్లే కాల్చరా ? పోనీ మల్లెపూలు తెప్పించండి."

వినబడనట్టు చల్లగా వూరుకున్నాడు.

"ఇదేమి మనుషులండీ మాట్లాడరు ? సరసానికి వచ్చినప్పుడు వట్టి చేతులతో వస్తారా ?.... మిమ్మల్నెక్కడో చూసినట్టు గుర్తు"

"బహుశా రోడ్డుమీదేమో !"

ఒక మధ్యతరగతి భోగందాని గది పందిరిమంచంమీద రెండు దొంతుల పరుపులున్నాయి తెల్లని దుప్పటి ఒకటి పరిచివుంది. దానిమీద ఒక మాసిపోయిన దుప్పటి సగానికి మడతబెట్టబడి కాళ్ళదిక్కున కప్పబడి వుంది. దానినిండా కాళ్ళమీదీద గుర్తులు. మంచానికి వెనకతట్టునా, ఎదురు గుండాను రెండు పెద్ద అద్దాలున్నాయి; వెనుక తట్టున ఉన్న అద్దానికి రెండువైపులా నగ్నస్త్రీల ఫొటోలు ఉన్నాయి. ఎదరద్దానికి పక్కగా నాగయ్య, నాగేశ్వర్రావు, నారాయణరావులు వేళ్ళాడుతున్నారు. ఉత్తరపు గోడనీ మహాత్మాగాంధీ, జవహర్ లాల్ నెహ్రూలు నిలబడ్డారు. తూర్పు దిక్కున శ్రీరామ పట్టాభిషేకమూ, నలుడు దమయంతిని విడిచిపెట్టి వెళ్ళిపోతున్న ఘట్టమూ, మేనక శకుంతలని విశ్వామిత్రుడు తిరస్కరి స్తున్న దృశ్యమూ అలంకారాలు. ఒక అద్దాలబీరువా, అందులో తువ్వాళ్ళు, మంచిమంచి చీరెల మడతలు, ఒక పౌడర్ డబ్బా, ఒక స్నో సీసా, ఈ తారలు ఈ నాయకులు ఆ గదిలోకి ఎందుకొచ్చారో అతనికి అర్థంకాలేదు. మంచానికి ఎదురుగా కుర్చీలో కూర్చోబోయాడు.

"అక్కడకాదు: ఇక్కడ....మీకిదంతా కొత్తల్లావుందే"

చెయ్యి పుచ్చుకొని మంచంమీదికి లాగింది మాసిన దుప్పటిని తేపే సింది తలుపులు గడియవేసి, దగ్గిరిగా లాక్కుంది. అతను ముఖం ఏవ గింపుగా పెట్టాడు. తాను దాటిపోడుగునా తనకు శాంతి అవసరాన్నిగురించే ఆలోచించాడుగాని, ఇక్కడ తాను పొందవలసిన "ప్రేమ" కి ఎలా పరి చయం చేసుకోవాలో ఆలోచించలేదు అంతా అతనికి కొత్తగా ఉంది.

పైగా ఆమె అతని భుజాలమీద చెయ్యి వేసినప్పుడు అతనికి ఒళ్ళంతా తేళ్ళూ జెర్రిలూ ప్రాకినట్లయింది. అతను ఈ వాతావరణంలోని "శ్రీం గారా"నికి సరిపుచ్చుకొని "సరసుడు" కావాలంటే కొంత మానసిక విస్మయం తొలగిపోవాలి అందుకుని,

"ఇందులో ఎంతకాలంనుంచి ఉంటున్నావ్ ?" అన్నాడు.

"ఎందులో ?"

"ఈ వృత్తిలో ?"

"రెండేళ్ళనుంచి"

"ఇప్పుడు నీవయస్సెంత ?"

"పధ్నాలుగు"

తన వయస్సెంత ?— ముప్పయినాలుగు తన పెళ్ళీడు కూతురు వయస్సెంత? పధ్నాలుగు 'ఛీ' అని తనలో తననే అసహ్యించుకున్నాడు. మళ్ళీ వెంటనే నవ్వుకున్నాడు. తన వెర్రిగాని, సానితో సరసానికివచ్చినప్పుడు వయస్సుతో పనేమిటి? తన కూతురే సాని అయితే రెండేళ్ళనుంచీ.... ఛీ!— తను పెద్దవాడినని బాధపడటం దేనికి? తనకంటే పెద్దవాళ్ళు లారుకనుకనా?

"నీకు కన్నెరికం ఎవళ్ళుచేశారు?"

"ఈ ఊళ్ళోని సుబ్బిశెట్టి"

వెధవ; వాడా? వలభయేళ్ళ వెధవ. వాడిముందు తను నయంకదూ వాడు బొత్తిగా మొదటి రోజునే. తనింకా రెండేళ్ళ తర్వాత!

"ఎధవ నగలెడతానన్నాడు మా అమ్మతో మాయకబుర్లు చెప్పి, మోసంచేశాడు. మా కులస్త్రీలంతా బుగ్గలు నొక్కుకున్నారు."

ఆ కుల స్త్రీ అనే మాటకి ఆమె అర్థాన్ని ఊహించుకుని నవ్వ

కున్నాడు ఆకులాంగనలనే తన కులం కులట అనుకుంటుంది. ఒకే మాట కున్న రెండు విపరీత అర్ధాల్ని ఆలోచించుకుని నవ్వుకున్నాడు సరసుడు గనక

"మొదటిసారి నీకు సిగ్గుకాలేదూ?"

'అవుననుకోండి. దీపం ఉంచమన్నారా? ఆర్పేయమన్నారా?'

'సుమారు ఎంతమంది వచ్చిఉంటారు'

'చాలామందే. నేను లెక్కెట్టానేంటండి! బాగానేఉంది.'

'పోనీలే-ఆ వచ్చిన వాళ్ళల్లో ఏవరంటే నీకు బాగా ఇష్టం?'

'కాంతారావంటే! మంచిడబ్బున్నవాడండీ, చాలా డబ్బిచ్చేవాడు. అచ్చు మీలా ఉంటాడు."

కామేశ్వర్రావుకు గుండె గుభేలుమంది. తనకి డబ్బు లేదుగా! ఐనా

'నేనంటే ఇష్టమేనా?'

"ఇష్టమే"

'అయితే నాతో వచ్చేస్తావా?'

"మీకు పెళ్ళయిందిగా?"

'అవుననుకో' అయినా నా భార్యకూ నాకూ పడటంలేదు, దాని ఆరోగ్యం మంచిదికాదు. అది గృహ కృత్యాలకి పనికిరాదు,' ఆ మాటకి తనకే నవ్వొచ్చింది.

'మీరిక్కడకొచ్చారని తెలిస్తే ఊరిపోనుకు చావదూ??

'ఆవిడకు తెలియదులే, పోనీకాని, నాతో వచ్చేస్తావా: నాకు నెలకి వందరూపాయలొస్తాయి మంచి ఇల్లు తీసుకొని కాపురం పెడతాను నెలకి వలభయి రూపాయలిస్తాను. వస్తావా?"

'ఎందుకురాను?—— వస్తాను'

ఆవిణ్ని గట్టిగా ముద్దు పెట్టుకున్నాడు. కాని అతని పిరికి గుండెల్లో ఏదోభయం ప్రవేశించింది.

'నీ వొంట్లో ఆరోగ్యం ఎట్లా ఉంది?' గద్గదికమైన గొంతుకతో ప్రశ్నించాడు.

'ఆరోగ్యానికేం. బాగానేఉంది. నిన్ననే పెన్సిలిన్ తీసుకున్నాను,

ఇంకో అయిదు నిమిషాల్లో కామేశ్వర్రావు నడుంవాల్చాడు. పది రూపాయలూ తీసుకొని. ఆమె లోపలికి వెళ్ళిపోయింది. అతను దీర్ఘంగా ఆలోచించటం ప్రారంభించాడు. ఆ మంచంమీద. ఇదివరకు, గత రెండు సంవత్సరాలనుంచీ, కనీసం రోజుకొక్కడుగా లెక్కపెట్టినా, సుమారు ఏడువందల ఇరవై ఎనిమండుగురు —తను పడుకున్న స్థానంలో తనలాగే పడుకుని ఉంటారు. ఇవాళ తను ఏడువందల ఇరవై తొమ్మిదోవాడు. తన నీచస్థితి చటుక్కున గుర్తుకొచ్చింది. తను భార్యకు చేసిన ద్రోహం ఎదర బడి వెక్కిరించింది. మనిషి మరీ కుదేలైపోయాడు "ఇది అడదేమిటి? ఇంతకంటే రాతి బొమ్మనయం." అనుకున్నాడు గదిలో మాటలు వినిపిస్తున్నాయి.

"ఏమే, పతికే ఒప్పుకొన్నావా?" తల్లికాబోలు.

"అవునే, ఏంచెయ్యను మరి?"

"పోనీవే, ఏంచేస్తావు.... కాని ఏమన్నాడే? మళ్ళి వస్తానన్నాడా?"

"వాడి ముఖం అన్నాడు. నేను ముద్దెట్టుకొంటే నీకు బావుంటుందా? నేను ముట్టుకొంటే నీకు ఉద్రేకం వస్తోందా?" ముసిలిపెథవ, "నిన్ను ఉంచు కుంటాను" అంటాడు. నన్ను ఉద్ధరిస్తాట!"

"వాళ్ళంతా అలాగే అంటారులే."

"వాడి అందం చెప్పు! వాడి బొమ్మెముక్కు పట్టుకొని అద్దంలో చూపించాలనుకొన్నాను."

'నరేగాని వెంకయ్యకాపుగారొచ్చే వేళయింది. ప్రావకంలో ఉన్నాను వెళ్ళమని చెప్పలేక పొయ్యావా?"

"వెళ్ళి గెంటుతానులే."

చటుక్కున లేచి, ఎవరూ చూడకుండానే కామేశ్వరావు గది విడిచి దొంగలా పారిపోయాడు, అతను ఏశాంతికోసం అక్కడికి వచ్చాడో ఆ శాంతిని పొందకుండానే మామూలు అశాంతితోనే వెళ్ళిపోయాడు.

తను అక్కడికి ఎందుకు వెళ్ళినట్టు? దేనిని ఆశించి? ఏమి సాధించాడు?

తన భార్యకు తను చేసిన అపరాధాన్ని ఊహించుకొని చాలా బాధ పడ్డాడు. ఆమె కాళ్ళపైబడి తన అపరాధాన్ని పూసగుచ్చినట్లు చెప్పుకొని క్షమించమని ప్రార్థిస్తే?

ప్రార్థిస్తే ఏమవునోకాని, తీరా అతను ఇంటిగుమ్మం తొక్కేసరికి సుభద్రమ్మ సముద్రమంత దుఃఖంతో ఉంది. కిరణా షావుకారు తనకి రావలసిన బాకీ నిమిత్తం ఇంటిమీదపడి ఆమెను నానా మాటలూ అన్నాడు.

"ఏమే, నేనో పెద్దపొరపాటు చేశాను. నా జీవితాన్నల్లా అవమానంలో ముంచే పొరబాటు" నాలికకొనదాకా వచ్చాయి మాటలు. కాని అక్కడ నుంచి ఆవిడలేచి వెళ్ళిపోయింది.

కామేశ్వర్రావు వివాహం చాలా చిన్నతనంలోనే అయిపోయింది.

పెళ్ళి ఎంత చప్పున జరుగుతుందో అంత ఎక్కువకాలం ఏడవక తప్పదు. అదేపెళ్ళిలోని రహస్యం, పెళ్ళిలో కామేశ్వర్రావుకీ సుభద్రమ్మకీ మధ్య గుడ్డతెర కట్టారు. పెళ్ళిలో ఆతెర తొలగించారు. అది మనుషులుకట్టిన గుడ్డతెర కనుక ఆ తెర అతి సులువుగా తొలిగిపోయింది. పెళ్ళి అయినతర్వాత ఆ దంపతులిద్దరిమధ్యా ఒక పెట్టనిగోడ లేచింది. ఆ గోడ మనుషులు కట్టింది కాదు. మనసులు కట్టిందికూడాకాదు. కొందరంటారు; వివాహంలో దురదృష్టవంతులైనవారికి, ఎంత అదృష్టమున్నా సున్నాయేనని, కాని ఎంత అదృష్టవంతులైనా నిర్భాగ్యులకు వివాహం

దురదృష్టమేనని జీవితం రుజువుచేస్తుంది. కామేశ్వరావు ఆరకం దుర దృష్టవంతుడు.

*  *  *  *

బొత్తాలనన్నా విప్పకుండా, ఎక్కడికి ఎందుకు వెడుతున్నాడో ఆలో చించుకోకుండా మళ్ళీ కామేశ్వరావు బయలుదేరాడు. కాని కామేశ్వర్రావు గమ్యమేమిటో అందరికీ తెలిసినదే. కామేశ్వర్రావు గమ్యమేకాదు: కామే శ్వర్రావు లాంటి దౌర్భాగ్యుల జీవిత గమ్యమే అంత! అలాంటివాళ్ళ జీవిత కావ్యాలు పువ్వుల తోటలో వెన్నెలవేళ స్త్రీపురుష ప్రథమ సమాగ మంగా ప్రారంభమవుతాయి. తరువాత జగన్నాటకమై దుఃఖాంతంగానే ముగుస్తాయి. అదే లోకచరిత్ర. ఈ చరిత్రే మాటిమాటికీ పునరావృత్త మౌతూంటుంది. ఈ సంగతి చాలా మందికి తెలుసేమో; తెలియదో? తెలి సినా తెలియకపోయినా మాత్రం చటుక్కున ఒకనిర్ణయానికి వస్తారు.

మనిషి పుట్టుకకీ మరణానికీ ఏదైనా మందుఉందా? లేనప్పుడు, అమరత్వమనేది, ఆమర్త్యత్వమనేది వట్టిమాటలే అయినప్పుడు, ఆ జనన మరణాల మధ్య కాలాన్ని ఎందుకు ఆనందంగా గడపకూడదు? తామరాకు మీద మంచు బిందువుల్లా కాలాంచలాలమీద మన జీవితాన్ని ఎందుకు వర్తింపజేయకూడదు. అంటీ ముట్టనట్టుగా ఆడే ఆ దోబూచులాటకంటే ఆనందమేముంది!

నిజమే, అందరూ ఇదే ఆశిస్తారు. కాని, ఏ ఒక్కరూ అలా బతక లేరు ఎంచేత బతకలేరు? ఎదురుగా పరిస్థితులుతమ భయంకర వదనగహ్వ రాన్ని తెరుచుకొని మీద పడుతూంటాయి. తమ వాడి గోళ్ళతో నెత్తురు పిండుతూంటాయి. వాడి కోరలతో మాంసాన్ని చీలుస్తూ ఉంటాయి. మనిషి మధనపేరు; పరిస్థితుల ఎదురు సన్నాహంపేరు, ఈ రెండూ అదృష్ట వంతుడికి ఏకమవుతాయి. దురదృష్టవంతుడి కట్లె వాటి రెంటికీ చుక్కెదురు.

ఆ దురదృష్టవంతుడు గొప్ప కళోపాసి కావచ్చు: గుమాస్తా కావచ్చు; మిల్లు కూలీకావచ్చు దురదృష్టవంతుడుగా మాత్రం నిజం.కొందరు ఆ పరిస్థితులకే లొంగిపోతారు. అలా లొంగిపోయిన వారిలో 'రెసిస్టెన్సు' ఉండదు. ఇంత కంటే శవాలులేవు. కొందరు ఎదుర్కొని తట్టుకోలేక చచ్చిపోతారు అలా చచ్చిపోయిన వారిలో కామేశ్వర్రావుకూడా ఒకడు. ఎట్లా చస్తేనేంగాక మొత్తానికి కామేశ్వర్రావు చచ్చిపోయాడు. కామేశ్వర్రావు చావు ఎవరికీ ఆశ్చర్యం కలిగించలేదు. కుక్కచావు చచ్చాడు కామేశ్వర్రావు. పాపం, కామేశ్వర్రావు!



# నిప్పుతో చెలగాటం

[ దయ్యాలున్నాయనేవాళ్ళు కొందరూ, లేవనేవాళ్ళుకొందరూ మన దేశంలో విపరీతంగా వున్నారు. ఈ సమస్యపై ప్రజాభిప్రాయానికై రిఫరెండం తీసుకొన్నట్లయితే మెజారిటీ నిర్ణయం దెయ్యాలున్నట్లుగానే తేలుతుంది. ఈ సమస్యపై ఒక్క నాస్తికులకూ ఆస్థికులకూ వైరుధ్యమే తప్ప మతభేదంలేదు, మహమ్మదీయులకి, హిందువులకీ, క్రైస్తవులకి అందరికీ దయ్యాలున్నాయి. ఎటొచ్చీ యింగ్లీషువాళ్ళ దయ్యాలకు తోకలుంటాయి, హిందువుల దయ్యాలకు తోకలుండవు.

ఏదిఏమయినా దయ్యాలు హిందువుల్లో బహుళవ్యాప్తిని పొందాయి. భగవంతుడివలె అవికూడా సర్వాంతర్యాములే. కనుకనే వాటికి "గాలి" అని పేరువచ్చింది. గాలి ఉన్నచోటల్లా దయ్యాలు ఉన్నట్టే. అనగా మనం దయ్యాల్ని పీల్చుకు బ్రతుకుతున్నామన్నమాట !

మన తెనుగు సారస్వతంలో దయ్యానికి అద్భుతమైన స్థానం వుంది. మనకీదయ్యాలు దేవుళ్ళతోనే సమానం. దైవం దయ్యం—ఈ రెండూ ఒకే పరమాత్మకు పర్యాయపదాలు. అంటే ఒకే ఆత్మస్వరూపాన్నే మనం దైవమని పూజించినా, దయ్యమని గ్రహించినా—

మరో తమాషాకూడా వుంది. తెలుగుమాట దయ్యం సంస్కృతం మాట దైవానికి తద్భవమై ఉండటంవల్ల తెలుగువాళ్ళ దయ్యాలు ఆర్యులకు దేవతలనీ, ఆర్యుల దేవతలు తెలుగువాళ్ళకు (ద్రావిడలకు) దయ్యాలనీ అనుకోవచ్చు. ఈ వినూత్న సిద్ధాంతాన్ని ద్రవిడకజగం వారికి విడిచిపెట్టటమే మంచిది.

ఇంతకీ అసలు కథలోకి వస్తాను.]

శ్రీమతీ నేనూ ఈ మధ్యనే బెంగుళూరు వెళ్ళాం. భారతదేశ మంతటికీ తలమానికంలా కనిపించే ఆ బెంగుళూరు మహానగరం సౌందర్యాన్ని చూసి ముచ్చటపడాలని శ్రీమతి కోరిక.

వెడుతున్నాం. దారంటే పోతూ, పక్కనే వున్న యింటిముందరి సైనుబోర్డుల్ని చదువుకొంటూ

"ది నేషనల్ అండ్ ఇంటర్నేషనల్ స్పిరిట్యువల్ రిసెర్చి ఇన్స్టిట్యూటు, బెంగుళూరు" అన్న బోర్డు మా కళ్ళముందుపడి మమ్మల్ని ఆకర్షించింది.

"ఏమండీ! యిదేమన్నా సారాకంపెనీయా?" అంది శ్రీమతి.

"కాదు. దయ్యాల కంపెనీ!" అన్నాను ఆగి. మరింత పరిశీలనగా చూశాము. శ్రీ కృష్ణమూర్తి యం. యస్. సి. ఎస్. ఆర్. సి. ఎస్. (లండన్) రిసెర్చి డైరెక్టర్ ఇన్ అని వుంది.

"ఏమండి మన తెలుగువాడిలాగేవున్నాడు. ఒకసారి లోపలికి వెడదాం రండి!" అని శ్రీమతి బలవంతం చేసింది.

"నీకేమన్నా దయ్యాలతో పనివుందా?" అని అడిగా

"నా పెళ్ళినాటికి మా అత్తమామల్ని పంపించేశారుగదా!....వాళ్ళతోటన్నా మాట్లాడదాం రద్దురూ!" అని గోలచేసింది.

భార్యాలోలులైనవాళ్ళకి ఎన్ని పాట్లుంటాయో ఆ సత్యభామా వల్లభుడికీ నాకూ మాత్రమే అనుభవం. కాకపోతే నా బ్రతుకిలా దయ్యాల పాలవదు. సరే పదమన్నాను.

పరిచయం చేసుకున్నాక శ్రీమతి అతనిపై ప్రశ్నలవర్షం కురిపించింది.

"ఏమండీ దయ్యాలు పెళ్ళిచేసుకుంటాయా ? అవి పిల్లల్ని కంటాయా ? లేక గుడ్లు పెడతాయా ? మనలోలాగే వాటిల్లోకూడా హోదాలు, హుందాలు పెరుగు తరుగులుంటాయా ? వాళ్ళల్లోకూడా కాంగ్రెసువాళ్ళు; కమ్యూనిస్టులు ఉంటాయా ? ఎన్నికలు ఉంటాయా ? వర్గపోరాటాలున్నాయా ?.... ఏమండీ దయ్యాలలోకంలో కొబ్బరికాయబొండవాండి ? అవి మన కొబ్బరికాయల్ని తింటాయే ! కోనసీమలో దయ్యంతిన్న కొబ్బరి కాయలనిచెప్పి ఎన్నిట్నో పారేస్తారు—ఆ సంగతి మీకు తెలుసా ?.... మన ఆవులూ, గేదెలూ, కుక్కలూ—యివికూడా చచ్చి దయ్యం ఆవులు, దయ్యంగేదెలు. దయ్యంకుక్కలుగా తయారవుతాయా ?...."

మరొకరయితే ఈ ప్రశ్నలవర్షానికి జవాబు చెప్పలేక ఉక్కిరిబిక్కిరై టూరున చావవలసినవాడే కాని, అతనంత అసమర్థుడు కాడని పించింది.

డ్రాయరు తెరిచాడు. డ్రాయరులోంచి కొన్ని కలరు పెయింటింగులు తీసి మా యిద్దరికీ అందించాడు. సాకల్యంగా చూశాం. చాలా చిత్రవిచిత్ర మైన బొమ్మలవి. అతను ఆర్టిస్టుకూడా కాబోలు. ఏమి ఆర్టది ! సాల్వేదార్ డాలీవంటి సర్రియలిస్టులుకూడా యిలాంటి బొమ్మల్ని వూహించలేకపో యారు. ప్రపంచ చరిత్ర అనాది యుగాల్లో ఉన్నట్టుగా వూహించబడుతున్న డ్రాగెన్‌వంటి జంతువులేకాదు. స్ఫింక్సు. వినాయకుడు. తుంబురుడు, మత్స్యకన్య—ఇలాంటి వికృతాకారాలుకూడా అధికంగా వున్నాయి.

"ఎలా ఉన్నాయి ?" అన్నట్టుగా మాకేసి చూశాడు.

"ఏమిటివి ?" అని అడిగాను.

"దయ్యాల జగత్తులోని జీవజంతువులు ! వాటి యథార్థస్వరూపాన్ని రంగులతో చిత్రించి చూపాను. ఇవేకాదు ! ఇంకా ఎన్నో వున్నాయి. వీట్ని

జాగ్రత్తగా చిత్రజగత్తులోకి తేవటం నాకుసాధ్యపడటంలేదు ఇందులోకొన్ని హిందూ, గ్రీకు పురాణాలలోకి ప్రవేశించి పురాణ దేవతలుగా నిలబడి పోయ్యాయి. బహుశా ఏ అణుయుద్ధమో అయినతర్వాత శేషించిన మానవ జగత్తును పాలించటానికై యివి అవతరిస్తాయి" అన్నాడు.

"ఓహో ! అందుకే మీరు ముందుగా వీటిని ప్రతిష్ఠించారా ? అని అడిగా. నాకు వళ్ళు మండింది వట్టి ఎం. ఎస్. పి. యే కాదు. ఎస్. ఆర్. పి. ఎస్. కూడా. మనకున్న శాస్త్రీయ జ్ఞానాన్నంతనీ మంటపెట్టి ప్రపంచంలో మూఢనమ్మకాలను స్థాపించటంకోసం బోర్డు కట్టాడా ? కూటి కోసమే కోటివిద్యలూ అనే సామెత ఊరికే పోలేదు 'బుద్ధి జాడ్య జనితో న్మాదుల్ కదా శ్రోత్రియుల్ అంటాడు పెద్దన్న, సైన్సులో గొప్పచదువులు చదివి వున్న మతికూడా పోగొట్టుకున్నట్టున్నారు అని ఈసడించాకూడా !

ఆయనకు కోపం రాలేదు. చిన్నగానవ్వాడు. "న్యూటను, గెలీలియో ఐన్‌స్టీన్‌వంటి వాళ్ళంతా మొదట్లో పిచ్చివాళ్ళే కదండీ ! ఇప్పుడో ?....నేనంతవాణ్ణి అవుతానని కాదుగానీ అలా పరిశోధన చెయ్యాలని మాత్రమే దయ్యాన్ని కనిపెట్టడం కోసమే నా జీవితాన్ని అంకితం చేశాను. దాన్ని చివరికి సాధించాను. అన్నాడు.

"మీ శాస్త్రజ్ఞులకు దేవుడెలాగూ దొరకడు. పోనీ దెయ్యమన్నా దొరికింది. దానితో సంతృప్తిపడండి." అన్నా ఉండబట్టలేక.

"అయ్యో ! అపాటి అర్థంచేసుకోలేరా? దయ్యాలు దొరికినా చాలు మా శాస్త్రజ్ఞులకి. ఎక్కడున్నా దేవుణ్ణి లాక్కురాగలరు. తొందరపడకండి ఆ రోజుకూడా దగ్గరకు వస్తుంది" అన్నాడు.

"ఇంతకీ దయ్యం దొరికిందంటారు ?"

"అందుకు సందేహమా ? కావలిస్తే సాయంత్రం రండి, మీకు చూపిస్తా. మీకున్న సమస్త సందేహాలూ నివృత్తి చేసుకోవచ్చు.

సరేనని చక్కావచ్చాము.

కానీ ఆ సాయంత్రం నాకెందుకో వెళ్ళబుద్ధికాలేదు. మనస్సులో ఓ భీతిలాంటి భూతం పీకుతూఉంది. ఒకవిధంగా నాకు భయంవల్ల గుండె బరువెక్కిందనేచెప్పాలి. కానీ ఆ సంగతి ఒప్పుకోవడానికిమాత్రం నా పౌరుషం అడ్డువచ్చింది. శ్రీమతి తయారై పదమన్నప్పుడుకూడా వద్దు పొమ్మని గదిమాను.

"ఆ పెద్దమనిషికి వస్తానని మాటయిచ్చాముగదండీ! వెళ్ళకపోతే బావుంటుందా?" అంది శ్రీమతి.

"ఏమీ కొంపమునిగిపోలేదు. ఇంతటి భాగ్యానికి అంతదూరం వెళ్ళాలా?" అన్నాను. 'మవ్వన్నావుచాలదా' అని మనస్సులో అను కున్నాను.

"మీకు దయ్యాలమీద నమ్మకం లేదంటున్నారుగా? ఒకసారిచూస్తే ఏమిపోయింది" రండి అని బ్రతిమాలింది.

ఆవిణ్ని తీసుకెళ్ళడం నాకసలు యిష్టంలేదు. దెయ్యాల్యా లేవని మనస్సుకు చెప్పుకుంటూ ఎంత ఓదార్చుకున్నా, తీరా అక్కడ దయ్యం వుందని ఎవరో చెప్పాక, అక్కడికి వెళ్ళాలంటే వళ్ళు జల్లుమనదా? ఎగదొబ్బాలని ఎంత ప్రయత్నంచేసినా సాగలేదు. స్త్రీ బుద్ధిః ప్రళయాంకరీ అని ఊరికినేఅన్నారా?

వెచ్చని కాఫీ చప్పరించి, ధైర్యాన్ని పుంజుకున్నాను. అయినా ఎందుకయినా మంచిదనిచెప్పి మరో యిద్దరు స్నేహితుల్ని సేకరించాను. అందులో ఒకడు వస్తాడు. ఒకపట్టాన గామాకికూడా కుస్తీలో లొంగే ఘటంకాడు. మరొకాయన కెమిస్ట్రీ లెక్చరరు. ఏ పచ్చభాస్వరాన్నో చీకట్లో చూపించి దయ్యమనుకోమంటే దాని అమీతుమీ తేల్చకుండా వదలిపెట్టడు.

ఈ దెబ్బతో కృష్ణమూర్తిగారి దయ్యమో; మా దయ్యమో వదిలిపోవాలనే సంకల్పంతోనే బయలుదేరాము.

కృష్ణమూర్తిగారు మా కోసం ఎదురుతెన్నులుచూస్తూ సిద్ధంగా వున్నాడు. నాతో వచ్చిన లెక్చరర్ని ఎంతో గౌరవించాడు.కూడా ఆయన పేరు ప్రతిష్టలు యిదివరకే విన్నాననికూడా అన్నాడు.

క్రమంగా దయ్యాలప్రసక్తి వచ్చింది. మా లెక్చరర్ "నాన్సెన్స్" అన్నాడు.

"మీరిక్కడే పొరపడ్డారు. సెన్సనేది మానవమేధస్సులో వుంది. అలాగే సెన్సు లేకపోవడమూ వుంది కానీ నాన్సెన్సుమాత్రం ఏ మేధస్సు లోనూ లేదు. శాస్త్రజ్ఞులై వుండికూడా ఆ శాస్త్రీయమైన ధోరణిలో మాట్లా డటం భావ్యంకాదు. మన భాషలో ప్రతి శబ్దమూ ఒక పనికో, వస్తువుకో పేరు. దయ్యమనే వస్తువే లేకపోయినట్లయితే, మన భాషలో ఆ పేరు వుండేదేకాదు. అది సైన్సు. దయ్యమూ, దేవుడూ లేని ఏ భాషన్నా వుందేమో చెప్పండి! అని కృష్ణమూర్తిగారు నిలదీసి అడిగారు.

మా లెక్చరర్ నా ముఖంలోకి చూశాడు. "ఇండో, యూరపియన్ భాషల్లోగానీ, సైనో, ఇండో భాషల్లోగానీ, దేవుడూ, దెయ్యమూలేని ఏభాషాలేదు" అని నేనూ ఒప్పుకున్నాను.

"అయితే, అవి ప్రత్యక్షంగా వున్నాయంటారా? శ్రీమతి అడిగింది.

"అమ్మా! ఆలోచన ఒకటి వస్తువొకటికాదు. ఈ సృష్టిలో మొట్ట మొదట వస్తువులు పుట్టాయి; ఆ తరువాత ఆలోచనలు పుట్టాయి. ఆలోచ నలను బట్టే ఆ తరువాత వస్తువులు పుట్టాయి. మనం ఒక వస్తువును ఊహించామంటే మన మనోజగత్తులో ఆ వస్తువును తయారుచేశామన్న మాట. ఊహచేసే సృష్టి యిదే. కొందరు కేవలం కంటితోనే చూస్తారు.

మన మహర్షులు తమ మనోనేత్రంతోచూసే, ఏ రాకెట్లూ అక్కరలేకుండానే గ్రహమండలాన్నీ, చంద్రోపరితలాన్నీ రోదసీకుహరాన్నీ, గ్రహకాలాలనీ నిర్ణయించగలిగారు. అది నిజమని మనం తెలుసుకోడానికి ఇరవైశతాబ్దాలకు పైగా పట్టింది అవునా ?"

శ్రీమతికి ఏమీ అర్థంకాకపోయినా, అర్థమయినట్లు తల ఆడించింది అర్థమయినా అవనట్లు మేము ముఖాలుదించుకున్నాం అయినా మా ప్రొఫెసరు అడిగారు.

"కేవలం ఆలోచనలతోనే ఇదివరకు ఎక్కడాలేని వస్తువును సృష్టిస్తున్నామని మీ అభిప్రాయమా ?"

"అవును ఇదే సమస్త సత్యాలకీ మూలమైన సత్యం. అందుకే మన ఋషులు చెడ్డ ఆలోచనలు ఉండకూడదని నిషేధించారు, ఒక్కొక్కప్పుడు కోపంవల్ల ఏ చెడ్డ ఆలోచనలన్నా కలిగినట్లయితే అవే శాపాలై తగులుతాయి."

"శాపాలమాట అలా వుంచండి కనీసం ఊర్ధ్వజగత్తులో ఆ ఆలోచనల కొకరూపం ఏర్పడుతుందంటారు."

"మానవశిరస్సు, కొమ్ములు, డెక్కలు రెక్కలు ఉన్న జంతువుని ఊహించామనుకోండి" అంటే ఆ జంతువు ఎక్కడో అక్కడ ఎప్పుడో అప్పుడు ఏర్పడినట్లే. ఆ ఊహకి భౌతికరూపం యివ్వగలిగితే ఈ జగత్తులోనే యీ కళ్ళతోనే చూడగలం. అదే నేను చేస్తున్న కృషి" అన్నాడు కృష్ణమూర్తి."

"అయితే చూపించండి; చూస్తాము" అంది శ్రీమతి.

"చూపించటం అంత తేలికయిన పనికాదు. అయినా యిప్పుడు మీలాంటి మిత్రులంతా అడిగారు కాబట్టి వాళకి వంచనలేకుండా కృషి

చేస్తాను. నేను చెప్పినట్లు కూర్చోండి."

నాకు వళ్ళు ఝల్లుమంది. చివరకు మృత్యువుతో చెలగాటానికి దిగినట్లున్నాము. ఈ ప్రతీపశక్తులన్నీ ఎంత లేవనిచెప్పి గుండె దిటవుచేసుకున్నా ఎలాగో అవి గుండెలోకిప్రవేశించి మనస్థైర్యాన్నిపోగొడుతున్నాయి.

"మూర్తిగారూ ! ఈ శక్తి పూర్తిగా మీ అధీనంలో ఉంటుందా ?" అన్నా.

"నా ప్రయత్న లోపంలేదు; అటుపైన భగవదేచ్ఛ. అమ్మా ! మీరిక్కడే కూర్చోండి. మీవారు మీపక్కనే కూర్చుంటారు. ఇవతల ప్రక్క నేను కూర్చుంటాను. మీవారి ప్రక్క వస్తాదూ, నా ప్రక్క ప్రొఫెసరూ కూర్చుంటారు. ఒక్కసారి గది అంతా కలియజూసుకోండి. ఇదిగో తలుపులన్నీ బిగించేస్తున్నాను ఇక దీపం ఆర్పేస్తాను" కృష్ణమూర్తి లేచాడు.

"దీపం ఆర్పాలా ఏం ?" అన్నాను.

"ఆర్పాలి. మీ ప్రొఫేసరు భావించినట్లు ఇదేమీ పచ్చభాస్వరం ప్రభావంకాదు. ఆత్మ ఈథర్ రూపంలో ఉంటుంది. దానికి కాంతిపృథః క్కరణ జరిగినట్లయితే ఈ శక్తి ఉద్భవిస్తుంది" అన్నాడు ఏమిటో నా కర్థంకాలేదు. మనలో యిప్పుడు ఆ శక్తి అవహించదగ్గ వైర్‌లెస్‌సెట్టు ఉంది. అమ్మా ! చీకట్లో భయపడకండి" అన్నాడు.

దీపం ఆర్పేశాడు. కళ్లు గాఢాంధకారాన్ని ఢీకొన్నాయి. చెల్లాచెదరయ్యాయి. మరికాస్సేపటికి అలవాటుపడి ఆ చీకట్లో మా మూర్తులన్నీ ఛాయామాత్రంగా కనిపిస్తున్నాయి. నిశ్చలంగా వున్న మా మూర్తుల ఛాయతప్ప మరేదీ కనిపించటంలేదు; ఇక ఆ గదిలో మా ఉచ్ఛ్వాసనిశ్వాసలన్నీ బరువుగా భారంగా వినిపిస్తున్నాయి.

"మోచేతుల్ని మీముందున్న బల్లమీద ఆన్చుకోండి. ఒకళ్ళనొకళ్లు స్పృశించుకోకూడదు అమ్మా! ధైర్యం తెచ్చుకోండి. నిద్రగానివస్తే మెలకువ పుచ్చుకోడానికి ప్రయత్నించండి! ఈసారి నిశ్చలంగా కూర్చుని ఎదురు చూద్దాం."

నిశ్చలంగా కూర్చుని చీకట్లోకి గుచ్చిగుచ్చిచూస్తూ ఆ అదృశ్య శక్తికోసం ఎదురుచూస్తున్నాం. ఎక్కడో గడియారం టిక్కుటిక్కుమనే శబ్దం. దూరంగా కుక్కలెక్కడో మోరలెత్తి ఏడుస్తున్నాయి. క్రమంగా కాళ్ళపై మంచుగడ్డ పెట్టినట్లయింది. చేతుల్లో రక్తనాళాలు బిగుసుకుపోతు న్నాయి. అరచేతులు మండుతున్నాయి వెన్నుమీద చలి వణుకు వస్తోంది. ఆ తరువాత ముంజేతుల్లోని ఎముకల్లో పోటు వచ్చింది. నా భార్య కూర్చున్నవైపు పార్శ్వమంతా ఆకస్మాత్తుగా సలపటం ప్రారంభించింది. అయినా అలాగే ప్రాణాలను గుప్పెటలో పెట్టుకుని ఆ కనిపించని శక్తి కోసం కళ్ళల్లో వత్తులు పెట్టుకుని చూస్తున్నాను.

బహుశా వాళ్ళందరికీ యించుమించు నా స్థితే ఉండిఉంటుంది. నాకు లాగే వాళ్ళ నరాలు కూడా బిగదన్ని ఉంటాయి.

ఇంతట్లో ఆకస్మాత్తుగా ఆ చీకట్లోనుండి ఏదో కీచుకీచుమనేశబ్దం వినిపించింది. ఎవరో పళ్ళు గిటకరిటమనే కూతపెట్టినట్లుఅయింది.

"ఏమిటది?" ప్రొఫెసరు అడిగాడు.

"ఏమీలేదు. ఆవిడగారుయిప్పుడు నానాహింసాపడుతున్నారు. ఒక్క నిముషం ఆగండి. మీకళ్ళముందే మహాద్భుతాన్ని చూస్తారు." అన్నాడు కృష్ణమూర్తి.

నా వళ్లు ఝల్లుమంది. నా శ్రీమతికేనా ఈ అవస్థ అంతా! ఆమె ఉచ్ఛ్వాసనిశ్వాసాలు మరింత బరువెక్కాయి. అప్పుడప్పుడు ట్యూబులైటు

వెలుగబోయేముందు రెపరెపలాడుతున్నట్టు ఏదో వెలుగబోయి ఆరబోతున్న ఆకుపచ్చని కాంతులు మా బల్లమీద మిణుమిట్లు గొలుపుతున్నాయి. బల్లమీద ఏదో బలమైన శక్తి పడుతున్నట్లు, అడుగుల చప్పుడు వినిపిస్తోంది. బల్ల ప్రకంపిస్తోంది. మా వేళ్ళకింద ఆ బల్ల ప్రకంపనాలు భయకంపంతో మహోద్వేగంతో కొట్టుకునే హృదయనాళ ప్రకంపాలను మించిపోయాయి. ఉండిఉండి ఆ బల్ల బీటలు వారినట్లు పెళపెళ శబ్దం వినబడింది. నల్లని జాడలుకట్టిన ఆ బీటలలోనుండి ఆకస్మాత్తుగా నీలిమంటలు రగుల్కొని మా చేతులమధ్య ఒత్తిలేని దీపంలా వెలుగుతున్నాయి:

"అదిగో దీపం" అన్నాడు ప్రొఫెసరు.

ఇది నిజమా భ్రమా లేక పైత్యవికారమా అని సందేహిస్తున్న నేను ఈసారి నిజమనే నిర్ధారించుకున్నాను. అది దీపంమాత్రం కాదు. దానికి కాంతిలేదు. కనీసం అది ఉన్న బల్లపైనన్నా, అది దీపమే అయినట్లయితే దాని కాంతి కిరణాలు ప్రసరించి ఉండాలి ఊహూ! అలా ఏం లేదు మెరిసే ఆవిరిఅది. పసుపూ ఆకుపచ్చ కలిసినరంగు! మొత్తం చిటికెనవ్రేలంత వుంది. అది ఆ బల్లపై గెంతుతున్నట్లుంది.

నా భార్యకేసి చూశాను. ఆమె ఈ లోకంలో లేదు. పూర్తిగా స్పృహతప్పి ఉంది. ఆవిడ పక్కాని ఏదో తేజస్సు ఆమె శరీరాన్ని ఆక్రమించినట్లు కనిపించింది. ఆమె శరీరం నుంచి పాదరసం ఆవిర్లు కనిపించాయి.

"ఏమి ప్రశ్నలడుగుదాం?" అన్నాడు ప్రొఫెసరు.

"ఇవాళ మన అదృష్టం. శ్రీమతి చాలా మంచి మీడియమ్ కనుక చాలా మంచి ప్రశ్నలే అడగండి!" అన్నాడు కృష్ణమూర్తి.

"అవును. అదే తెలివైనపని, మాకు తెలియని ఏదో కొత్తగొంతుక గంభీరంగా అన్నది.

"ఎవరు ? ఎవరది మాట్లాడుత ? మీరా కవిగారూ ? ప్రొఫెసరు అడిగాడు.

"నేను కాదండీ, బహుశా మా ఆవిడేమో. కాని ఆవిడ గొంతుక యింత భయంకరంగా ఉండదు" అన్నాను ఎల్లాగో సంబాళించుకుని.

"ఏమమ్మా మీరేనా ?" అని అడిగాడు ప్రొఫెసరు.

"ఆవిడ కాదు. ఆవిడ శరీరాన్ని స్వాధీనం చేసుకున్న మరో శక్తి యిప్పుడు మాట్లాడుతోంది : ఆ గంభీరమైన మాటలు ఆవిడ పెదాలలోంచి స్పష్టంగా వినబడ్డాయి.

"ఆవిడ యిప్పుడెక్కడున్నారు ? ఆవిడకేమీ ప్రమాదంలేదుకదా !

"ఏమీ ప్రమాదంలేదు. ఆవిడిప్పుడు భూలోకంనుంచి అతల, వితల, తలాతల, మహాతల లోకాలు దాటి హాయిగా విహరిస్తోంది. ఆవిడ స్థానంలో నేను ఉన్నాను. కనుక, నా స్థానంలో ఆవిడ వుంది.

"అయితే మీరెవరు ?"

"నేనెవరయితే మీకెందుకు ? మాకేమీ పేర్లుండవు. ఒకప్పుడు మీలాగే ఈ లోకంలో బ్రతికి, ఎప్పటికయినా చావక తప్పని మీలాగే వచ్చి బ్రతుకుతున్నవాణ్ని. ఈసారి తెలిసిందా ?

తెలియకనే ఒళ్ళు ముచ్చెమటలు క్రమ్మాయి. బల్లమీద వున్న ఆ లేత ఆకుపచ్చ కాంతి దీపం క్రమక్రమంగా శ్రీమతికి సన్నిహితంగా వదుస్తోంది. నా గుండెలు గతుక్కుమన్నాయి. ప్రాణాలతో బయట పడ తామో లేదోనన్న భయమే నాలో ఎక్కువయింది.

"చెయ్యకూడనిపని చేస్తున్నామేమో ! ఇంక ఈ తతంగం ఆపెయ్య

కూడదా ? అందామని ప్రయత్నించాను. కాని, ఆ మాటలు గిట్టకరుచుకున్న నాపళ్ళని దాటి పెదాలదాకా రాలేదు.

"ఏమీ భయంలేదు. ప్రారంభదశలో ఏ నూతన శాస్త్రాన్నైనాసరే ప్రభుత్వం చట్టవిరుద్ధంగా భావిస్తుంది. ఆ శాస్త్రం ఎలాగో బ్రతికి బయట పడ్డాక దాన్ని చట్టసమ్మతంగానే అంగీకరిస్తుంది. కనుక దేనికి భయపడ కుండా, ఈ సదవకాశాన్ని తీసుకొని, మృత్యువు స్వభావమేమిటో మనం తెలుసుకోగలిగితే చాలు" అన్నాడు ప్రొఫెసరు. వీణ్ణి ఇందుకా నేను తీసుకొచ్చింది !

"అదే తెలివైనపని !" అంది ఆ గొంతుక.

"అయితే సరే, నీవు అక్కడ వున్నట్టు నీకు సమస్తమూ తెలిసి నట్లూ నాకు రూఢికావటం ఎలాగ? నా జేబులో యిప్పుడెన్ని డబ్బులున్నాయో చెప్పు ముందు?"

"ఇలాంటి చచ్చుప్రశ్నలకి సమాధానం చెప్పటానికి నేను రాలేదు. మామూలు దయ్యాలు ఆపని చేస్తాయి. కావలిస్తే చేటలోబియ్యాన్ని కూడా ఎగరవేసిచూపిస్తాయి. తలుపుల్ని దబాదబా ఆడిస్తాయి. కాని నేను మీకు తెలి యని చాలా కొత్తవిషయాన్ని చెప్పి, మీకు జ్ఞానోదయం కలిగించటానికే వచ్చాను.

"క్షమించండి? చాలా తెలివితక్కువగా అడిగాను పోనీ మీరెవరో చెప్పండి!"

"అది మీకనవసరం?

"పోనీ మీరెంతకాలంనుంచి ఇలా ఉన్నారు?

"మీకుమల్లె మాకు కాలప్రమాణమేదీలేదు. మా పరిస్థితులేవేరు, కాని, అశోకుడి ఆస్థానంలో నేను రాజవైద్యుణ్ణిగా ఉండేవాణ్ణి.

అశ్వనీ దేవతలని అంటారే—వాళ్ళున్నారా?

"ఉన్నారు,

"దేవుడనే వాడెవరైనా ఏ లోకంలోనైనా, ఉన్నాడా?"

"మీ లోకంలోనే వ్యూహమాత్రంగా ఉన్నాడు. మా లోకంలో ఒకే ఒక్క మహాశక్తి వున్నది. అదే పరమాత్మ"

"మరి మీరెవరు?"

"అందులో అంశాలం"

'మీరేమి చేస్తుంటారు?"

'ఆత్మాభ్యున్నతికి కృషిచేస్తూవుంటాం. మంచిచేయటమే మా అభి మతం.

'మీకు బాధలనేవి ఉన్నాయా ?'

'లేవు. దేహానికేగాని, దేహికి బాధలులేవు'

'పోనీ మానసిక బాధలుంటాయా?'

'ఉంటాయి. అవే కోరికలు ఆ కోరికలున్న వాళ్ళే తిరిగి జన్మిస్తారు. విచారమూ, సంతోషమూ అనేవి మాకున్నాయి.'

"వాటిని ఎలా ప్రకటిస్తారు?"

'భూకంపాలు, తుఫానులూ మొదలైన వాటిద్వారా."

'మీకు బంధువులు, మిత్రులు, పుత్రులూ ఉంటారా?'

"ఉండరు."

"భూమిమీద భార్యాభర్తలుగా వున్నవాళ్ళు, చచ్చిన తర్వాత తిరిగి కలుసుకోరా?"

'అది వారి ఆధ్యాత్మిక బంధాన్ని బట్టి ఉంటుంది. అలాంటి బంధమే లేకపోతే ఒకరికొకరు ఏమీకారు.

"అట్టి బంధాలున్న వాళ్ళు ఏమవుతారు."

"తిరిగి తిర్యగ్యోనుల్లో పుడతారు."

'మేము చేస్తున్న పని మంచిదేనా?'

'మంచి ఉద్దేశ్యంతో చేస్తేసరి.'

'చెడ్డ ఉద్దేశ్యమంటే ఏమిటి?'

"కొంటెతనమూ, నిర్లక్ష్యమూ."

"దానివల్ల ప్రమాదం ఉందా?"

"చాలా."

"ఎలాంటిది?"

"దుష్టశక్తుల్ని ఆహ్వానిస్తే తెలుస్తుంది. వాటివల్ల శరీరమూ మనస్సూ కూడా దెబ్బతింటాయి."

"శక్తి ఒకటే అయి అది పరమాత్మే అయినప్పుడు దుష్టశక్తి ఎక్కడనుంచి వస్తుంది?

"శరీరం నుంచి వెలువడి. మానవ వాసనవల్ల పరమాత్మలో లీనం కాకుండా అందరూ తిరిగే శక్తి—అదే దుష్టశక్తి:

"మీరు జపతపాలు చేస్తారా?"

"చేస్తాం"

"ఎందుకు ?"

"మనకు మించిన శక్తిని కొలిచేందుకు!"

"మీమతమేమిటి?

"మీకున్న మతాలన్నీ మాకూ ఉన్నాయి.

"మతకలహాలుంటాయా?

"ఉండవు.

ఆప్రొఫెసరు మరికొన్ని ప్రశ్నల్ని వెయ్యబోయాడు, కాని ఆత

ఆగొంతుక వినబడలేదు.ఆశ్నలకిక జవాబు చెప్పాలని ఆ శక్తికి అనిపించి ఉండదు.

"అయిపోయింది.మీకింక జవాబులు రావు. అన్నాడు కృష్ణమూర్తి.

"పోనివ్వండి! నాకీజవాబులపై విశ్వాసం లేదు. నాకు కావలసింది ఒక్కటే ఈశక్తి యదార్థ స్వరూపాన్ని సాకశ్శారా చూడాలి! అప్పుడు నమ్మాలి.అదే యిప్పుడు మనస్సులో కోరుతున్నాను.అన్నాడు ప్రొఫెసరు.

ఆ గాడాంధకారంలో,ఆగదిలో మొట్టమొదట ఏవిధమైన భయోత్పాతం నాలో కల్గిందో అదే మళ్ళీ వచ్చింది.

అపచ్చని దీపకలిక రెపరెపలాడుతూ బల్ల పైవక్కి వెళ్ళింది,అక్కడ నుంచి ఒక్కదూకులో గదిమూలకు వెళ్ళింది. ఉంది ఉంది ఆగదిమూల ఎర్రనిపోగ మేఘంగా రూపొందింది! ఘటోత్కచుడో, హిడింబాసురుడో విలబడ్డట్టుంది. ఆతర్వాత ఆ దీపకళిక సరిగా కనపడలేదు.

"పోయింది"అన్నాడు ప్రొఫెసరు.

"పోలేదు, అదిగో,ఆమూల సరిగ్గాచూడు!"

భయంకరమైన జంతువేదో ఊపిరి పీలుస్తున్న చప్పుడు వినిపిస్తోంది.

"ఏమిటది

"ఏమో!

'అమ్మయ్యో! నాపక్కని కూర్చున్న వస్తాదు. ఒక్కసారి అర్చాడు అరుస్తూ లేచి కలియబడ్డాడు. ఆ చీకట్లో ఘోరయుద్ధమైపోతోంది. పెద్ద పెద్ద డెక్కలతొక్కుడు కొమ్ములతో పొడుపులు! నోటితో కరుపులు! క్షణంలో ఆగదంతా అతలాకుతలమైపోయింది. బల్ల ముక్కముక్కలై

పోయింది. కుర్చీ మీంచి పడిపోయాము. గదికి నాలుగుమూలలా చెల్లా చెదరై పోయాము. ఆ వినూత్నశక్తి ఆ గదిలో హుంకరిస్తూ ఉరకలువేస్తు తాండవ మాడేస్తుంది. ఆ వస్తాదు ఒక్క పోటుతో పచ్చడై నేలమీద పడున్నాడు. నా శ్రీమతి ఏమయిందో! అమ్మయ్యో ఏదో నాకాలు తొక్కేసింది. సున్నంలోకి ఎముక లేకుండా కాలు వచ్చడయిపోయింది.

"బాబోయ్! దీపం" అని అర్చాను.

"దీపం వెలగటం లేదు!"

'అగ్గిపెట్టె తియ్యండి!

'పుల్లలు లేవు!

"ఏయ్ కృష్ణమూర్తిగారూ! ఆపవయ్యా దీన్ని!" ప్రొఫెసర్ పొలికేక పెట్టాడు.

'నా తరంకాదు. బాబోయ్! నేనాపలేను. తలుపు తియ్యండి! బయటకు పోదాం! పోదాం! కృష్ణమూర్తి అరుస్తున్నాడు.

అదృష్టవశాత్తూ నా చెయ్యి తలుపు గడియపై బడింది. తియ్యబోతుండగా ఆ పశువువచ్చి నన్ను ఢీకొని ఆ తలుపుకేసి నొక్కింది నా ప్రాణం కిటకిటలాడిపోయింది. కాని మరుక్షణంలోనే అది పక్కకి తప్పుకోవటంవల్ల, ఎలాగో తలుపు తెరుచుకుని బైటపడగలిగాను. నాతో బాటే వాళ్ళు ముగ్గురు కూడా బైటపడి తలుపు బిగించేశారు ప్రాణంపై తీపి అలాంటిది! కాని, లోపల ఆ జంతువు మాత్రం విశృంఖలంగా రంకె వేస్తూనే వుంది. బల్లల డమ డమ శబ్దం, కుర్చీలు గుండపిండవుతున్న చప్పుడు వినిపిస్తోనేవుంది.

'ఏమంటారు ఈ జంతువు?

'ఏమో, దానికి మనిషి తల వుంది. కొమ్ములున్నాయి. గుర్రంలా

ఉంది చూడటానికి. రెక్కలూ డెక్కలూ వున్నాయి. నోట్లో కోరలున్నాయి తలుపు వేసేటప్పుడు చూశా! ప్రొఫెసరు అన్నాడు.

అప్పుడు నాకు జ్ఞాపకం వచ్చింది. నా భార్య్య సంగతి, 'బాబోయ్! నాభార్యా' అని గట్టిగా కేకవేసి, ముఖం తిరిగి కిందపడ్డాను.

అప్పటికి ప్రొఫెసర్‌కి కూడా జ్ఞప్తికొచ్చింది.

'చంపేశాము బాబోయ్! ఎలాగో చప్పున ఆమెని బయటకు లాక్కరావాలి. ఆలశ్యం చేస్తే ప్రయోజనం వుండదు పదండి! అని అర్చాడు.

వస్తాదు వొళ్ళు హూనమయిపోయింది. ఇంచుమించు అందరి వొళ్ళూ అల్లాగే వుంది. అయినా తప్పదు గదా!

తలుపు తీసుకొని గదిలోకి దూకారు గుండ పిండయిన ఆ బల్ల చెక్కల కింద పడివుందామె. ఆమె కుర్చీ నామరూపాలు లేకుండాపోయింది. ఆమెజుట్టు పట్టుకొని బరబరా బయటకు ఈడ్చుకొచ్చారు. తలుపువేస్తూ ప్రొఫెసరు ఆ గదిలోకి చూస్తే, ఆ చీకట్లో రెండుకళ్ళు టార్చీలల్లా మెరుస్తున్నాయట! గబుక్కున తలుపుమూశాడు. లోపలినుండి ఆ దుష్టశక్తి ఆతలుపును ఢీకొని ఆమూలాగ్రం ముక్కచెక్కలు చేసింది.

''వచ్చేస్తోంది! వచ్చేస్తోంది!
'పరిగెత్తండి. పరిగెత్తండి!

కాళ్ళు ఆడలేదు. ఎవరికీ ఓపికలేదు. పైగా మా చేతులలో మాకుమించిన బరువు మా శ్రీమతి ఎక్కడికనిపోగలం ?

ఇంక సమస్త భారమూ భగవంతుడిమీదనే వేసి అక్కడే అలాగే చతికిలబడ్డాను. ప్రొఫెసరూ కృష్ణమూర్తీ వస్తాదూ పక్కగదిలోకిపోయి తలుపులు బిగించుకున్నారు.

ఏదో భయంకరమైన వన్యమృగం ఆ గుమ్మంలోంచి వస్తుందనీ అది మా భార్యాభర్తలిద్దర్నీ ఒక్కసారే పొట్టపెట్టుకుంటుందనీ అలా ఎదురుచూస్తూ కూర్చున్నాను. కానీ ఏమీ రాలేదు. కాస్సేపు గదిలో ఆ డెక్కల చప్పుడే వినబడ్డతర్వాత చల్లారిపోయింది. మరో అయిదు నిమిషా లకి అంతా ప్రశాంతంగా ఉంది. మరో అయిదు నిమిషాలకీ ఆ గుమ్మం లోంచి తెల్లని కాంతిశకలమొకటి మేఘపుంజంలా తేలుతూ బయటకు వచ్చింది. అందులో వెలిసిపోతున్న లేతాకుపచ్చ దీపం మిణుకుమిణుకు మంటూ ఉంది. చివరికి అదికూడా ఆరిపోయి ఆ మేఘం నా కళ్ళముందే మాయమయింది.

వెంటనే కేకవేశాను. పోయింది రమ్మన్నాను అందరూ బైట కొచ్చారు. ఎలక్ట్రిక్ లైట్లు తమంతటామే వెలిగాయి. అంధకారమంతా ఎగిరి పోయింది. ఆ గదిలోకూడా దీపం వెలగడంతో లోపలికి భయం భయం గానే తొంగిచూసాము. చివరికి బల్లలుకూడా విరిగిపోలేదు అన్నీ యధాస్థా నంలో ఉన్నాయి;

'అదృష్టవంతులం మనం! ఇంత జరిగినా ఎవరికీ ప్రమాదం జరగలేదు సరిగదా వస్తునష్టంకూడాలేదు. అదిఅలా ఉంచండి. సామాన్యు లెవరూ పొందని అపూర్వానుభవాన్ని ఇవేళ మనం సంపాదించుకున్నాం' అన్నాడు ప్రొఫెసరు.

"ఇక ఈ జీవితంలోమాత్రం ఇలాంటి ప్రయోగం చెయ్యను!" చెంపలు వాయించుకున్నాడు కృష్ణమూర్తి.

ఎవరి అనుభవం వారికయింది. ఈ దెబ్బతో స్త్రీ బుద్ధేకాదు దుష్ట బుద్ధి అంటే ఏమిటోకూడా నాకు అర్థమయింది.

ఆ తర్వాత నెల్లాళ్ళకుగాని మా ఆవిడ కోలుకోలేదు. ❋

# వెలిగిన దీపం - ఆరని అగ్ని

"ఫరవా లేదు ! నీకు మోసం జరగదు." అదీ ఆయన చెప్పిన మాట ! ఆ మాటనమ్మి మోసపోయాను ! నా సమస్త తనూసౌందర్యాన్నీ ప్రేమనీ రాజుకు అర్పించాను. ...చివరికి శ్రీనివాసరావుని పెళ్ళాడాను ! !"

శోభనంనాటిరాత్రి పెళ్ళికూతురు గుండెలు ఎందుకో టువ్వుటువ్వుమంటాయి. అది సంప్రదాయమయిపోయింది. కొంగున కాసుముడి పెట్టినా, మెడక్రింద గంధంరాసినా, చక్కిలిగింతలు పెట్టినా, చివరికి.... ఆ భయం ఉండనే ఉంటుంది.

పేరంటాళ్ళంతా దంపత తాంబూలాలు పుచ్చుకుని 'జాగ్రత్తసుమా!' అని హెచ్చరిస్తూ బైటకు నడిచేవేళ, అమ్మ అందరికన్నా ఆఖర్న మా గది తలుపులు బిగించేవేళ ఏదో ఆపద మీద పడుతున్నట్టనిపించి ఒళ్ళు ఝల్లుమంటుంది. ఇది సర్వలోకసామాన్యమైన భయం!

కాని, నాబ్రతుక్కు ఆ భయంలేదు. నాకున్నభయమల్లా ఆ సంగతి ఎక్కడ బైటపడుతుందోనని!

అసలు సంగతి ఎవరికీ తెలియకుండా ఉండాలని వేయిదేవుళ్ళకు మొక్కుకున్నాను. అలాగే ఇంతకాలందాకా కాపాడుకున్నాను. కాని, ఇప్పుడు ఈ రాత్రి! ఆయనకన్నా వెల్లడికాకుండాపోతుందా! ఇన్నాళ్ళుగా నేను దాచి కాపాడుకున్న నా రహస్యం?

ప్రత్యేకం తెల్లచీర కట్టుకుని, మెడనిండా బంధువులిచ్చిన నగలు పెట్టుకుని, అద్దంలో చూసుకుంటూకూడా అణుచుకోలేని అశ్రువుల్ని కొన

గోళ్ళతో మీటుకుంటూ, మనస్సులో పరిగెట్టేరైళ్ళను ఆపుకోలేక కృంగిపో తున్నాను.

వాల్తేరులో చదువుకొంటున్న రోజులవి. ఇద్దరమూ ఆనర్సు చదువు కొంటున్నాం. రాజు నా కన్న మూడేళ్ళు పెద్ద. ఆంధ్రోత్సవాల్ని దిగ్విజయంగా జరిపించటంలో మా చేతులు రెండూ కలిశాయి. ఫలితంగా మేము సంపాదించుకున్న పొగడ్తలతో మా మనసులు రెండూ కలిశాయి. కాని ఇద్దరికీ అంతకన్న ముందుకు నడిచే అవకాశాలులేవు. మా మధ్య కట్టని గోడలా భయం ఆవరించింది.

ఇద్దరమూ హాస్టల్‌లో లేకపోయినా తరచు కలుసుకునే అవకాశాలు లేవు కనుక మాలో ఆ రోజుల్లో మొలకెత్తిన ఆశలు అప్పుడే వాడిపో యాయి

పరీక్షలు వ్రాశాను. చదువుకూడా పూర్తయిపోయింది. ఇంక ఇంటికి వెళ్ళిపోతాను. నాకోసం యెక్కడో ఎదురు చూసే అమ్మా నాన్నా నాకు జ్ఞాపకం వచ్చారు. కాని, వెళ్ళబోయేముందు స్వేచ్ఛగా, సరదాగా ఒకటి రెండు సినిమాలు చూడాల్ననీ ఒకటిరెండుసార్లన్నా బీచీలో కూర్చోవాలనీ అనిపించింది.

అలాగే ఆ రోజున కూర్చుని నా భవిష్యత్తును గురించి ఆలోచించు కుంటున్నాను.... ఇక పెళ్ళి చేసుకోవాలి! ఉద్యోగమన్నా చెయ్యాలి!.... ఆడదాని జీవితానికి పెళ్ళికూడా ఒక ఉద్యోగమే! అలాంటప్పుడు రెండు ఉద్యోగాలెందుకు?

ఇలాంటి తియ్యని కలలుకంటూ అతను పలకరించేదాకా మేలుకొనే లేదు.

"లలితా!.... మరచిపోయావా?" అన్నాడు రాజు. అతని చేతిలో కాలుతున్న సిగరెట్టు అవశేషాన్ని నేలవేసికాలుతూ.

"రండి....కూర్చోండి !" అన్నా తేరుకొని. లాంఛనపూర్వకమైన నా ఆహ్వానాన్నికూడా అందుకోకముందే అతను నా ముందు కూర్చున్నాడు చంద్రోదయమవుతోంది సముద్రతరంగాలు ఉవ్వెత్తుగాలేచి ఒడ్డుల్ని ఢీకొంటున్నాయి. సముద్రతరంగాల స్పర్శకు భూదేవి మురులుకొంటున్న వెచ్చని ఆవిరులు ఆమె శరీరంనుండి వెలరేగుతున్నాయి.

"పేపర్లు బాగా రాశారా ?" అన్నాను.

"ఆహా !.... మీరో ? అన్నాడు నా పక్కనే యిసుకలో వదుము వాలుస్తూ, ఆ తర్వాత యెంతోసేపు ఆంధ్రోత్సవాలగురించీ, అప్పటి మా విజయాన్ని గురించీ చెప్పుకుని మురిసిపోయాం.

తలవనితలంపుగా మనకేదన్నా విజయం కలిగినట్లయితే అదే ఎప్పుడూ జ్ఞాపకం వస్తూవుంటుంది. అప్పుడు పరవశమైపోతాం అంత వరకూ బిగబట్టుకుని ఉన్నవాళ్ళంకూడా అన్ని మానసిక విరోధాలూ మరచి సంతోషంతో పరవళ్ళు తొక్కుతాం. అదేస్థితి నాకు దాపురించింది. అప్పటికి ఎంతసేపయి నా తొడలపై తల పెట్టుకుపడుకున్నాడో నాకు తెలియదు. పైగా ఆ సంతోషంలో అతవిజుట్టు నిమురుతున్నానుకూడా నా స్థితిని నేను సంబాళించుకొనేసరికి వొళ్ళు ఒక్కసారి ఝల్లుమంది.

నా నోట మాటరాలేదు. అతను గ్రహించివుంటాడు !

"లాలీ ! ఏమి ఆగిపోయావ్ ? ఆ రోజు ఆంధ్రావీక్ లో ఆఖరి రోజున పాడిన 'వందేమాతరమ్' మళ్ళీ పాడవా అన్నాడు. అతని చెయ్యి నా వీపును నిమురుతోంది.

పాటకాదుగదా మాటకూడా లేకుండా నిశ్చేష్టురాలనయిపోయాను. అతను నా మెడవెనుక చేతుల్ని తగిలించి నా తలను తనపై లాక్కుని పెదాలపై ముద్దులవర్షం కురిపించాడు. నా శరీరం పట్టు తప్పిపోయింది.

నిర్మానుష్యమైన ఆ సముద్రపు తటాన చంద్రబింబంసాక్షిగా ఆ వేళనే నన్ను నేను రాజుకు అర్పించుకున్నాను.

"నిన్ను ప్రేమిస్తున్నాను లాలీ!.... నిన్ను పెళ్ళి చేసుకుంటాను. ఆంధ్రోత్సవాలలోనే నా మనస్సు నీకు అంకితమైపోయింది."

అప్పటికి నాకు తెలివి వచ్చింది. "పిచ్చిరాజూ! నీకన్న నేనే ముందు ప్రేమించాను'' అన్నాను.

"ఎప్పటినుంచీ?"

"నేను పుట్టినప్పటినుంచీ!'' అన్నాను. కడుపుబ్బానవ్వుకున్నాము. రాజు నవ్వుతూనే అన్నాడు.

"అయితే మన ప్రేమ ప్రపంచవిడ్డూరాలలో ఒకటయిందన్నమాట!" అని, అతను లేచి నిలబడ్డాడు. నేనూ లేచినిలబడాను తనచేతులు నా నడుము చుట్టూ వేసి బిగించి మా హృదయాలను సన్నిహితంచేశాడు. మా యిద్దరి శరీరాలూ ఒక దానిలో ఒకటి లీనమైపోయ్యాయా అన్నంతదగ్గరగా మా యిద్దరి గుండెలూ కొట్టుకుంటున్నాయి మా పెదాలు చటుక్కున కలుసుకున్నాయి! వెంటనే ముఖం తిప్పేసుకుని 'వద్దు' నాకు భయంవేస్తోంది. పోదాం! మావాళ్ళతోచెప్పి వాళ్ళ అనుమతి తీసుకుందాం." అన్నాను.

రాజు వెంటనే ఇసకలో కూలబడ్డాడు. 'లాలీ! నేను నిన్ను పెళ్ళి చేసుకుంటాను; నీకు నేనంటే యిష్టమేగదా!.... ఇంకా భయం దేనికి?... ఒకరిమీద ఒకరికి ఈ మాత్రంలో నమ్మకం లేకపోతే.... చదువుకున్న వాళ్ళకీ, మూర్ఖులకీ తేడాలేదా?"

నేనేమీ మాట్లాడలేకపోయాను. తప్పు నాదికాకపోయినా, నాదే తప్పయినట్టు అయింది. నిజంగా చదువుకోవటంకూడా ఆడదానికి తప్పేనని ఆ క్షణానగాని తెలియలేదు.

నేనున్నూ నిరాశాహతురాలినై చతికిలబడిపోయాను. నా జన్మకు మాత్రం రాజువంటి భర్త దొరుకుతాడా? ఈ అవకాశం విడిస్తే మళ్ళీ నాకు దొరుకుతుందా?

నన్ను దగ్గరిగా, తనవొళ్ళోకి తీసుకుంటూ "లాలీ; నువ్వుకావాలి!" అన్నాడు. గొంతుక గాద్గదికమైపోయింది. కళ్ళల్లో జ్యోతులు మెరుస్తున్నాయి. అతని చేతుల్లోని కండరాలు బిగిసిపోతున్నాయి. నాలో వణుకు బయలుదేరింది. అయినా నన్ను నేను నిరోధించుకుంటూనే వున్నాను.

"నువ్వు కావాలి లాలీ!.... నువ్వు కాదంటే బ్రతకలేను!" రాజు నన్ను తనపక్క సాగిపడేలా త్రోసివేసాడు గట్టిగా నా చీరకుచ్చెళ్ళనూ, పమిటనూ అదముకుంటూ "వద్దు!.... తప్పు!" అన్నాను.

"పిచ్చిలాలీ ! ఇక్కడెవరూలేరు! ఎవరికీ తెలియదు! ఏమీ ఫరవాలేదు లాలీ! నేను నిన్ను పెళ్ళిచేసుకుంటా! అ టూనే ఆరాత్రి ఆ వెన్నెట్లో అతను చేసిన సాహసాన్ని విరోధించలేకపోయాను. చదువుకున్నవాళ్ళం గనుక ప్రేమించుకున్నవాళ్ళం గనుక. పెళ్ళిచేసుకోదలచుకున్నాం గనుక ....తప్పులేదనుకున్నాను.

* * * * * *

అతనుకూడా కొంతవరకూ ఆడినమాట తప్పలేదు. నాతోటే తిన్నగా మా వూరు వచ్చాడు. మా యింట్లో రెండురోజులపాటు ఎంతో బుద్ధిగా నటించి బుద్ధిమంతుడనిపించుకున్నాడు తరువాత వెళ్ళిపోయాడు.

నేటికి సరిగా రెండేళ్ళయింది ఈ సంఘటనజరిగి. ఇవాళ అద్దంలో శోభనం పెళ్ళికూతురుగా నా ముఖవర్చస్సును నేనే పరిశీలించుకొంటూంటే ఈ పౌడర్లచాటున మణిగి అవమానం రగులుకొంటున్నట్లు నాకే అనిపిస్తోంది.

అతను వెళ్ళిపోయిన తర్వాత మా నాన్నగారు నవ్వుతూ నా యెదురు గుండా అమ్మతో అన్నారు.

"... అమ్మాయి, చాలా జాగ్రత్తైనదేసుమా! ఈ కాలం పిల్లలాంటిది కాదు !"

ఒకరకంగా ఆయనకు నాపై వున్న విశ్వాసాన్ని ప్రకటిస్తున్నట్లున్నా వినానికిది తెరమరుగు హెచ్చరికలాంటిది. దానిభావం నాకు అర్థం కాక పోలేదు.

అమ్మ నా అపద గ్రహించింది!

మీతో నన్ను చెప్పమందండీ! మీరు అనుమతిస్తే అతన్ని పెళ్ళి చేసుకుంటుందట! అతగాడు అడిగితే అలాగేచెప్పి మన యింటికి తీసుకొచ్చా నంది! అయినా అది మూర్ఖురాలు కాదుగా చేతులు కాల్చుకోటానికీ! అది చదువుకున్న దాయిరి! అని సమర్థించింది అమ్మ! అమ్మదృష్టిలో నా చదువు కిప్పుడు సార్థకత కనిపించింది.

సిగ్గూ, అవమానమూ నాలో పెనగొన్నాయి. నాకు తెలియకుండానే నా శరీరమూ బుద్ధీ నా తల్లిదండ్రుల ఊహకు కూడా అందకుండా మారి పోయాయని తెలుసుకుని కుమిలిపోయాను

మరో వారం తిరిగివచ్చింది. అయన వచ్చాడు, అయన వస్తారని నా హృదయానికి తెలుసు ఆయనచే యెలాగో మా నాన్నగారితో నన్ను పెళ్ళిచేసుకుంటానని చెప్పించాలి దానివల్ల నాన్నగారికి నాపై అనుమానం పోతుంది. ఒకవేళ అనుమానంవున్నా మేమిద్దరమూ ఎలాగూ పెళ్ళిచేసు కుంటాముగదా అన్న ధైర్యంతో మా జోలికిరారు! అయినా రాజు ఎలాగూ నన్ను పెళ్ళిచేసుకుంటాడు గనుక తప్పకుండా చెపుతాడు—ఇదీ నావిశ్వాసం.

ఏమయినా మా వాళ్ళు నేను అబద్ధమాడుతాననుకోలేదు. అందరి కన్నా నేను శీలం విషయంలో తక్కువదాన్నని భ్రష్టురాలవనీ కనీసం

వారు ఊహించనైనా లేదు....మళ్ళీ బీచి అనుభవం నాకు కలగగూడదు అనుకున్నాను.

అలా ఎప్పటికప్పుడు అనుకుంటూనేవున్నాను. ఎప్పటికప్పుడు నా అనుకోవటాలూ, వేడికోవటాలూ నిరర్ధకమవుతూనేవచ్చాయి. ఏగది మూల మూలనో, ఏ చీకటి సందులోనో, పెరట్లోనో వ్రతభంగమవుతూనేవుంది. రాజుఫరవాలేదు లాలీ అంటున్నాడు. గనుక, 'వద్దుబాబూ!' అని నా సణుగుడు కన్నా "నువ్వు కావాలి లాలీ" అన్న అతని ఆకాంక్ష బలీయంగా వున్నది గనుక—యేమయితేనేమి నాకు నెల తప్పింది.

*　　　*　　　*　　　*

రెండు సంవత్సరాల తర్వాత ఈరోజున మళ్ళీ కొత్త పెళ్ళికూతుర్నయ్యాను. ఈ పిల్కు-చీరల తళుకులన్నీ నా వంటిమీద యెంత మెరిసినా నా మనస్సుకుతగ్గ ఆహ్లాదాన్నివ్వలేక పోతున్నాయి. ఆలోచనా భారంతో ఎక్కడో అక్కడ చతికిలబడుతున్నాను. ఈ చీరల మడతలన్నీ నా పిరుదులపై రెపరెపలాడుతున్నాయి. వివాహమనే ఇలాంటి పవిత్రమైన రోజును కన్యగా పొందాలని తహతహలాడాను. ప్రపంచానికీ, ఇప్పుడు నన్ను వివాహం చేసుకుని "ధర్మేచ, అర్థేచ. కామేచ నాతో సమాన భాగస్వామిగా ఉంటానని ప్రమాణం చేసిన ఈ శ్రీనివాసరావుగారికి నేను కన్యనయితే కావచ్చుగాని, నాకు మాత్రం ఇది పునర్వివాహమేగదా!

రాజు—లలిత ప్రేమ బూడిదలో కలిసిపోయింది! లైలా—మజ్నూ సాఫో-ఫావో, సావిత్రి-సత్యవంతులు ఎంత ప్రేమించుకున్నారో కథల్లోనైతే చదివాం ఇప్పుడుమాది ఆధునికమైన ప్రేమ! సమస్తానికీ చెడినా జీవచ్ఛవాలలా బ్రతుకుతామేగాని సాహసించి చావలేనివి మా ప్రేమలు! 'పిచ్చిలాలీ!.... ఏమీ ఫరవాలేదు లాలీ! నిన్ను పెళ్ళి చేసుకుంటా!.... ఎవరికీ తెలీదు!' మా ప్రేమకు లక్ష్యమే యింత! అదృష్టం కలిసివస్తే

వలగురిలో పడకుండా చూసుకుని, మోసగించి, యెంతో తెలివితేటలతో సంఘనియమాలను ఉల్లంఘించి, యవ్వనశ్రీని, శీలాన్ని రాజు దోచుకున్న ఆ రోజుల్లో "నేనూ, శ్రీనివాసరావుబావగారూ వచ్చాం. తలుపుతీయండి!" అని చెప్పుకోవలసిన రోజు వస్తుందని కలగన్నానా?

తలచుకున్నకొద్దీ ఈ సంతోష సమయాన నాలోంచి దుఃఖం పెల్లుబికివస్తూనే ఉంది. గతించిపోయిన ఆ రోజులన్నీ ఒకదాని వెనుక త్రోసుకు వచ్చి గుండెల్లో శూలాన్ని గుచ్చుతూనే వున్నాయి.

ఎన్నిసార్లు అడిగినా నాన్నగారితో చెప్పకుండా రాజు తప్పించుకుంటూనే వున్నాడు. సరే, అతనే చెప్తాడన్న ధోరణిలో నేనుకూడా అంతలా పట్టించుకోకుండానే ఉంటూవచ్చాను.

మా యిద్దరికీ ఒకరిపై ఒకరికి మూఢనమ్మకం వుంది గుడ్డి ప్రేమానుబంధాలే నమ్మల్ని బంధించాయి. ఇద్దరం ఎంత ఎంత ప్రేమించుకున్నప్పటికీ నీ బిడ్డ నా గర్భంలో పడిందని భర్తకాని వాడికి ఏ స్త్రీ ధైర్యంగా చెప్పగలుగుతుంది? అహంకారం నాకు అడ్డువచ్చి రాజుతో చెప్పనిచ్చిందికాదు. ఖాయమయేదాకా చూడటం మంచిదని ఊరుకున్నాను.

ఎంతయినా అజ్ఞానురాలిని కాదు. ఇప్పుడు నేనెలాంటి నరకంలో చిక్కుకున్నానో గ్రహించాను. అప్పుడే ఒళ్లు తిరగటం, పొద్దుటే వికారపెట్టటం, వాంతులువంటివి ప్రవేశించాయి

నాతో హైస్కూలులో చదువుకున్న ఒకమ్మాయి పెళ్ళికి మేమంతా వెళ్ళాం. ఆపిల్ల పెళ్ళినాటికి గర్భవతి అని అందరూ ముసిముసి నవ్వులు నవ్వారు. గుసగుసలాడుకునేవారు. అమ్మలక్కలు బుగ్గలు నొక్కుకునేవారు! అందరికీ ఎగతాళీగా, నవ్వుతాలుగా ఉండేది! — ఆ గతే నాకూ పడుతుందనిపించింది.

మా అమ్మకు తెలియకుండా దాచుకోవాలి, మా నాన్నగారికి తెలియకూడదు. ఇక రాజుకుకూడా తెలియబరచకపోతే దాగే సంగతాయిది?

అయినా మొండిగా, చీమకూడా కుట్టనట్లే తిరిగాను. ఏ చీకూ చింతా లేనిదానిలా నటించాను. ఎంత నటిస్తే మాత్రం ఆడదానికి తెలియదా?

"అమ్మాయి! ఒంట్లో బాగాలేదా ఏమే" అంది మా అమ్మ!

"నీకు ఛాదస్తమేమిటమ్మా! బాగా రొంపగా ఉంది!" అన్నా మరో అబద్ధం. అయితే నా అబద్ధంకూడా మా వాళ్ళకి నమ్మదగ్గదిగానే ఉంది. ఆ ముందురాత్రి మంచులో పడుకోవటంవల్ల రొంపపట్టింది.

ఇక అమ్మ సంరక్షణ ప్రారంభమయింది. ఎవరైనా కాస్త జబ్బు పడితే చాలు! అమ్మకి బ్రహ్మానందం! జబ్బుపడ్డవాళ్ళకి సేవచేయటమంటేనే అమ్మకి సరదా: ఇక ఒకటే తోమటం ప్రారంభించింది; ఆ మందులేమిటో మా అమ్మమ్మ కాలంనాటివన్నీ నూరిపోసింది: దుప్పటి కప్పింది, యూక్లిప్టస్ ఆయిల్ వీపుకీ గుండెకీ పట్టించి తోమింది.

అదంతా హాయిగా భరించాను. తల్లి సేవాభాగ్యాన్ని పొందటంలో యెంత సుఖం వుందో మళ్ళీ అనుభవానికొచ్చింది. ఇంత అమాయకులైన తలిదండ్రుల్ని నేను మోసగించానా?

'అమ్మా! కళ్ళుమూసుకు నిద్రపో' అని వెళ్ళిపోయిందమ్మ! నాకు నిద్రపడుతుందా? ఓహ పట్టాన పట్టలేదు. చివరకు అంతా నిద్రపోయాక లేచి కూర్చుని, చూసిచూసి నా నోటితో చెప్పలేని ఈ విషయాన్ని కాయితం మీద వ్రాసి మర్నాడు రాజుకు పోస్టుచేద్దామని వుంచాను. అప్పుడు నిద్ర పట్టింది. ఏ క్షణంలో నాకడుపులోవున్న పాపాయి కదులుతుందోనన్న భయమే నన్ను పట్టుకు వేధించసాగింది; ఆ ఉత్తరం చదివి రాజు యేమవుతాడో!

నా అదృష్టం బావుండి మర్నాటి ఉదయానికే వాతావరణం మారి పోయింది. మా అమ్మ యిచ్చిన అమ్మమ్మకాలంనాటి ఏ మందు పని చేసిందో నాలోపట్టిన ముసురంతా మటుమాయమయిపోయింది. చదువుకున్న వాళ్ళకి ఎకసెక్కాలుగా వుంటుందిగాని, అమ్మమ్మ మందులే బాగా పని చేస్తాయేవ్" అంది అమ్మ చూస్తూనే ! నాన్నగారుకూడా అమ్మతో యేకీభ వించారు. తెల్లారగట్ల నేను గర్భవతిని కాదన్న సంగతిఖాయం కావటంవల్లనే నేనింతహాయిగా ఉన్నానని వీళ్ళకర్థం కాలేదు. నా ప్రాణం తెరిపిన పడ్డట్ట యింది ! ఒక్కసారి "అమ్మయ్య;" అనుకున్నాను.

రాజునుంచి జవాబు రాలేదు. వస్తుందన్న ఆశతో వెయ్యికళ్ళతో ఎదురుచూస్తున్నాను. అమ్మా నాన్నగారూ కలిసి యెంతో కొంత ఆలోచన పడుతూనే వున్నారు. నా పెళ్ళి సంగతేదో చప్పున తేలకపోతే నలుగురి లోనూ అల్లరి పాలవుతామన్న భయం వాళ్ళది ! వాళ్ళ తప్పేమీలేదు.

ఏమీ తోచక కిటికీ పట్టుకుని శూన్యాకాశంలోకి చూస్తూ పాడుకుం టున్నాను :

"నన్నిడిచిపెట్టెళ్ళినాడే నా రాజు
మొన్న తిరిగొత్తానన్నాడే : "

గుండెలు తిరిగే పాటది; హృదయం రగిలిపోయేలా పాడుతుంది ఎంకి. ఎంకిపడ్డ ఆ ఆవేదనలోని అర్థం యిప్పుడు నాకు అవగతమవు తోంది !

"టక్, టక్, టక్"

తలుపుమీద వ్రేలి ముణుకుతో కొట్టిన చప్పుడు: తృళ్ళిపడిలేచాను. అప్పుడు ! రాజే; నారాజు ! నా జీవితాశాశాన్ని పాలించేరాజు ! రతిరాజు !

ఒక్క ఉరకలో వెళ్ళి తలుపుతీశాను. నిర్ఘాంతపోయాను ! అతని ముఖంలో కత్తివేటుకు కూడా రక్తపుచుక్కలేదు.

తలుపు త్రోసుకుని తిన్నగా నా గదిలోకి వచ్చాడు. ఆయన్ని నేనూ అనుసరించాను. వస్తూనే నా వైపు తిరిగి :

"లలితా ! నీ సంగతి పూర్తిగా నాకర్థమైంది.... చదువుకున్నావన్న మాటేగాని, నీతి నియమాలులేని మనిషివి నువ్వు ! నాకుపూర్వమే నీకెవరితోనో సంబంధాలున్నాయట !... నాకు ఆకాశరామన్న ఉత్తరం వచ్చింది! ఎవడికి తెచ్చుకున్నావో ఈ కడుపు !" అన్నాడు.

ఈ ప్రపంచం నాకళ్ళముందు గిరగిరా తిరిగిపోతున్నట్లనిపించింది. మూర్ఛ పర్యంతమయి నిలదొక్కుకుని "అబద్ధం అలాంటిమాటనకు రాజూ, నేను నీదాన్ని, కిట్టనివాళ్ళ ఉత్తరాలు నమ్మకు" అంటూ ఆక్రోశించాను.

రాజు వినిపించుకోలేదు. "మనం కలుసుకోక పూర్వమే వచ్చివుంటుంది నీకీ కడుపు." అన్నాడు. వట్టిదని చెప్పాను; వంట్లోబాగోలేకపోవటం వల్ల అలా అనుమానపడ్డాననీ, బహిష్టయ్యాననీ నిజం చెప్పివేశాను.

"అయితే గర్భవిచ్ఛేదం చేయించావన్నమాట."

నాకు వళ్ళు మండిపోయింది ఏమి జవాబు చెప్పాలో తెలియక ముందే సాచి లెంపకాయ కొట్టాను. ఇద్దరమూ కన్నీళ్ళతో ఒక్క క్షణం ఒకరి ముఖం ఒకరం చూసుకున్నాం. మరుక్షణం రాజు మరో మాటన్నా ఆడకుండా మరో మాటన్నా వెనుదిరిగి చూడకుండా మా యిల్లు విడిచి వెళ్ళిపోయాడు.

భయంతో కోపంతో గజగజ వణికిపోతూ అలాగే నిలబడిపోయాను. మామూలుగా ఎందుకడగకూడదు ? తిడుతూ ఎందుకడగాలి ? నేనుమాత్రం

మనిషినికానా ? నాకుమాత్రం ఆత్మగౌరవంలేదా ? నన్నిలా అవమానించటం తప్పుకాదా ?

తప్పే-ఆ తప్పు ఒప్పుకుంటూ మరో వారంరోజుల్లో అతను ఉత్తరం వ్రాశాడు. నా పవిత్రతను అనుమానించినందుకు తన్ను తిట్టుకున్నాడు. ఏమయితేనేంగాక ! హృదయంలో పుండంటూ పడకనే పోవాలిగానీ, అది పడితే మానదు.

మా అమ్మ నా పెళ్ళి ప్రసంగం ఎత్తితే నేను పెళ్ళి చేసుకోనని చెప్పాను. యేమైనా ఉద్యోగం చెయ్యాల్సని వుందన్నాను. మా అమ్మా, నాన్నా తెల్లబోయారు.

నాన్నగారుచాలాబాధపడ్డారు. అవులిస్తే పేగులు లెక్కపెట్టగల మనిషి ఆయన! రాజూ నేనూ కలిపి నిర్మించుకున్న గాలిమేడలన్నీ కూలిపోవటంతో ఉభయులమూ ఒకరికొకరం యెంత సన్నిహితంగా ఉండాలని ప్రయత్నించినా విఫలమవుతూనే వచ్చాం.

ఉద్యోగంలో చేరిన తర్వాత రాజుపై ప్రేమలవలేశంకూడా లేకుండా పోయింది. ఆనాటి మధురానుభవాల మధురస్మృతులు మాత్రమేమిగిలాయి.

ఉద్యోగం చేస్తున్న రోజుల్లోనే శ్రీనివాసరావు నా జీవితంలోకి ప్రవేశించారు; అయన ప్రవేశమూ రాజు నిష్క్రమణా ఒక్కసారి జరిగాయి.

నిజం చెప్పమంటే ఒక్కమాట చెపుతాను. నేను శ్రీనివాసరావును ప్రేమించలేదు నేను రాజునే ప్రేమించాను. ఆయన్ని ప్రేమించలేదు. కనుకనే ద్వేషించనూలేదు. నాడు ప్రేమించాను కనుకనే నేడు రాజు ముఖం చూడటానికికూడా నాకు అసహ్యంగా వుంది. నన్నడిగితే ప్రేమ, ద్వేషమూ-ఈ రెండూ అవిభాజ్యాలని చెపుతాను.

వాచీ చూసుకున్నాను. శోభన ముహూర్తానికి అరగంట పైముంది. నా కన్యాత్వాన్ని ఈ అమృతమూర్తికి అర్పించుకోలేక పోయానన్న చింత తప్ప నా కిప్పుడేమీ లేదు.

అయినా ఒక బుగ్గ పరవశంతో నవ్వుతుంటే మరో బుగ్గ దుఃఖంతో కుమిలిపోతున్నది. ద్వంద్వాలు సుఖదుఃఖాలుః రెండూ ఒకేసారి ప్రాప్తిస్తే ఆ అనుభవం అందరూ పొందవలసిందే.

'అమ్మాయి!.... ఏంచేస్తున్నావ్?' అవతలనుంచి అమ్మ అరుస్తోంది. అమ్మ బొత్తిగా హడావిడిమనిషి!

"ఇక్కడున్నానమ్మా" అన్నా కన్నీళ్ళు తుడుచుకుంటూ.

"రా అమ్మా రా! నా బంగారుతల్లీ!.... ఇవాళతో నిన్నొక అయ్య చేతిలో పెట్టేశాను!.... అమ్మా ఇంక నీ దారినీది మా దారిమాది! పంతంటి పిల్లని పాపిష్టివాడి చేతుల్లో పెడుతున్నాను!" అంటూ అమ్మ ఏడ్చింది.

"అమ్మా! ఈయన పాపిష్టివాడా!"

"కాదమ్మా!!.... ఏమిటో కన్నపేగ్రిమకదమ్మా.... అలా అనిపిస్తుంది. నేకేమమ్మా మీ ఆయన బంగారపు బొమ్మ!— చూడు!... నీ కొంగున కాసుకట్టాలి!.... అంతవరకూ ఒప్పుకోకు!— మొదటి రోజు కదమ్మా కొంచెంబాధ పడించాలి లేకపోతే వాళ్ళు తప్పట్టుకుంటారు! పదమ్మాపద!....

అమ్మ నా భుజాలను పట్టుకుని శోభనం గదిలోకి తీసికెడుతూంటే రానున్న మధురానుభూతుల్ని తలచుకుంటూ గగుర్పొడిచే శరీరంతో అడుగులు వేస్తున్నాను.

నలుగురికీ దంపత తాంబూలాలిచ్చాక, "జాగ్రత్తసుమా ! పిచ్చి తల్లి అని హెచ్చరికచేస్తూ అమ్మ బైట గొణ్ణెం పెట్టిన తర్వాత, ఆయన గంధమలందిన చెయ్యివట్టుకు లాగారు: అప్పుడు మళ్ళీ వినిపించాయి :

"ఫరవాలేదు లాలీ ! నీకు మోసం జరగదు" అన్న మాటలు :

దీపం వెలిగింది. నా హృదయ వీణాతంత్రులు ఇప్పుడు అపూర్వ సంగీతాన్ని వినిపిస్తున్నాయి. అయినా అపశ్రుతిలా ఆరని అగ్నిచ్ఛటలు రెపరెపలాడుతూనే వున్నాయి.



## ఈ గ్రంథంలో...

తన చెల్లెలికి బదులు తానే ఆడవేషం వేసుకుని శోభనం గది లోకి ప్రవేశించి, పెళ్ళికొడుకు చెల్లెలికి శోభనంచేసి చక్కావచ్చిన మహాపతిరాజా.

ప్రబంధకవులు భావకవులు కలిసి ఏర్పాటుచేసిన ఆడవాళ్ళ ప్రత్యేక సంతలోకి ప్రవేశించి నానా గందరగోళం చేసిన అరుద్ర, సోమసుందర్ వంటి అభ్యుదయకవులూ.

శాంతికోసం ఇల్లాలినివిడిచి సానివాడలంట అన్వేషిస్తూ బయలు దేరిన అసమర్థుడు కామేశ్వర్రావూ.

దయ్యాన్ని కళ్ళారా చూడాలని పనిగట్టుకుని, తీరా దయ్యాల పరిశోధన శాలలోకి ప్రవేశించి, ప్రయోగంతో దయ్యాన్ని వీకల మీదకు తెచ్చుకుని, చావుతప్పి కన్ను లొట్టపోయినంత పర్యంతమయి చెంపలు వాయించుకున్న "నేనూ"

ఆనాటి — ఆ శోభనంనాటి రాత్రి పడకటింట్లో వెలిగిన దీపం జాడల్లో హృదయంలో రగులుకొన్న ఆరని అగ్నిచ్ఛటలు దహించి వేస్తూవుంటే గతస్మృతుల్ని నెమరువేసుకుంటూ శోకించే పిచ్చి 'లాలి'.

ఈ గ్రంథంలో ప్రధానపాత్రలు. వారి జీవితాలు, అనుభవాలు, ఆవేశాలు — అన్నీ ప్రత్యేకమైనవే. చదివి చూడండి.

Dharmachakra Power Press, SAMALKOT 533 440